

# భారతరాజ్యాంగప్రణాళిక

శ్రీ కె. వి. దేశికాచారి ఎమ్. ఏ; బి. ఇడి.
సోషలు స్టడీస్ అసిస్టెంటు, బోర్డుహైస్కూలు,
ఎలమంచిలి.



ప్రకాశకులు:
రౌతు బుక్ డిపో,
ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,
రాజమహేంద్రవరము.

1950




భా[illegible] [illegible] ప్రణాళిక

డాక్టర్. శ్రీ బాబు రాజేంద్రప్రసాద్,

హిందూదేశ అధ్యక్షులు.

# ఉపోద్ఘాతము

భారతరాజ్యాంగ ప్రణాళిక భారతీయ ప్రజల జన్మస్వాతంత్ర్యముల నిర్దేశించు పత్రమైయున్నది. భారతీయప్రజలచే ఎన్నుకొనబడిన రాజ్యాంగ పరిషత్తే (కాన్స్టిట్యూయెంట్ అసెంబ్లీ) భారతరాజ్యాంగ ప్రణాళికను సిద్ధపరుపవలెనను ఆశయము 1922 వ సంవత్సరముననే గాంధిమహాత్ముడు ప్రతిపాదించెను. 1935 వ సంవత్సరమున ఈ ఆశయము కాంగ్రెసు సమావేశముచే తీర్మానింపబడెను. 1946 వ సంవత్సరము మార్చి 15 వ తేదీని బ్రిటీషు ప్రధానమంత్రియగు అట్లీ కామన్సుసభలో చేసిన ప్రకటన ననుసరించి 1946 వ సంవత్సరము మే 16 వ తేదీ అమాత్యత్రయ రాయబారవర్గమువారు భారతరాజ్యాంగ విధానమును భారతీయు లెన్నుకొనిన కాన్స్టిట్యూయెంట్ ఎసెంబ్లీయే నిర్ణయింపవలెనని ప్రకటించెను.

పిమ్మట వివిధరాష్ట్రములనుండి యెన్నుకొనబడిన 308 మంది సభ్యులు 1946 వ సంవత్సరము డిసెంబరు 9 వ తేదీని మొట్టమొదటసారి సమావేశమై మొత్తము రెండు సంవత్సరముల పదునొకండు నెలల పదునెనిమిది దినముల కాలము చర్చలు జరపి 1949 వ సంవత్సరము నవంబరు 26 వ తేదీతో తమ కార్యక్రమము జయప్రదముగ ముగించిరి.

రాజ్యాంగ పరిషత్తునకు బాబురాజేంద్రప్రసాదు అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను; ఈ పరిషత్తు పదునొకండుసార్లు సమావేశములు జరపెను. ఈ సమావేశములను మొత్తము మీదపబదినూడు వేలమంది ప్రేక్షకులు సందర్శించిరి. రాజ్యాంగ పరిషత్తు కార్యక్రమము ముగియుసరికి 63,96,729 రూపాయలు ప్రభుత్వమునకు వ్యయమైనది.

రాజ్యాంగ ప్రణాళిక రచనాసంఘమున (డ్రాప్టింగు కమిటీ) లో సభ్యులు ఆరుగురు:—

1. డా. బి. ఆర్. అంబేద్కర్ (అధ్యక్షులు) 2. శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యరు. 3. శ్రీ యన్. గోపాలస్వామి అయ్యంగార్. 4. సయ్యద్ మహమద్ సోమల్లా. 5. శ్రీ కె. యం. మున్షి. 6. శ్రీ టి. టి. కృష్ణమాచారి. రాజ్యాంగ ప్రణాళిక రచనలో పండిత జవహర్లాలు నెహ్రూయును, సర్దార్ వల్లభాయి పటేలును అనేకమగు ఉపసంఘముల కధ్యక్షులుగనుండి అమూల్యమగు సేవజేసిరి.

భారతప్రభుత్వ రాజ్యాంగపు సలహాదారగు సర్. బి. యన్. రావుగారు సిద్ధముచేసిన ముసాయిదాను రచనా సంఘమువారు పరిశీలించి అవసరమగు మార్పులుచేసి 315 నిబంధనలతోను, 8 షెడ్యూలులతోను గూడిన చిత్తుచట్టమును రాజ్యాంగపరిషత్తులో ప్రవేశపెట్టిరి. సభ్యులు రమారమి 7635 సవరణలు ప్రతిపాదించుటకు నోటీసునిచ్చిరి గాని 2473

మాత్రమే సమావేశములలో ప్రవేశపెట్టబడి చర్చసాగెను. తుట్టతుదకు 395 నిబంధనలతోను 8 షెడ్యూలులతోను భారత రాజ్యాంగ ప్రణాళిక రూపొందినది.

రాజ్యాంగ ప్రణాళిక నిర్మాణమునందు మన దేశము నితర దేశములతో కొన్ని విషయములందు సరిపోల్చిచూతము.

| దేశము | రాజ్యాంగ ప్రణాళిక రచనకాలము | నిబంధనలు |
|---|---|---|
| అమెరికా సంయుక్త రాష్ట్రములు | 4 నెలలు | 7 |
| కెనడా | 2 ఏండ్లు 5 నెలలు | 147 |
| ఆస్ట్రేలియా | 9 ఏండ్లు | 128 |
| దక్షిణాఫ్రికా | 1 సంవత్సరము | 153 |
| భారత దేశము | 2 సం॥ 11 నె॥ 8 రోజులు | 395 |

మనరాజ్యాంగ ప్రణాళిక ఆంగ్ల భాషలో రచింపబడినది. హిందీ మున్నగు భాషలలోనికి అనువదింపబడినది. భారతీయ పౌరులందరును భారతరాజ్యాంగ ప్రణాళికలోని ప్రధానాంశములు తెలిసికొనుట అత్యావసరము. మన రాజ్యాంగమునందలి ముఖ్యవిషయములు ఆంధ్రలోకమునకు వెల్లడియగుట ఆవశ్యకమను నుద్దేశ్యముతో రాజ్యాంగ ప్రణాళిక సంగ్రహమును ఆంధ్రభాషలో రచించితిని. ప్రధానములు సర్వసాధారణములునైన అంశములు తగినంత విపులముగనే వ్రాసి అప్రధాన విషయములను సూక్ష్మీకరించితిని.

సాధ్యమగునంత యెక్కువమందిజనులలో రాజ్యాంగ ప్రణాళికనుగూర్చి ప్రచారము జరుగవలెనను నభిలాషయే నన్నీ ప్రయత్నమునకు పురికొల్పినది. నాకార్య నిర్వాహణాత్వములో కొన్ని లోపము లుండుట కవకాశముగలదని నాకు దెలిసియే యున్నది. తద్జ్ఞు లిందలి లోపముల మన్నించి గుణమునే గ్రహింతురుగాక.

ఈ గ్రంధమును ప్రకటించి నన్ను ప్రోత్సహించిన ప్రఖ్యాత విద్యావిషయిక ప్రచురణకర్తలగు శ్రీ రాము బుక్ డిపో వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

యెలమంచిలి
19-3-1950

ఇట్లు
కె. వేం. దేశకాచార్యులు.

# విషయసూచిక.

## మొదటి భాగము.

### భారతసమాఖ్య (యూనియన్)కు చెందిన ప్రాంతము.

సమాఖ్య (యూనియన్) పేరు, సమాఖ్యకు చెందిన ప్రాంతము; క్రొత్తరాష్ట్రము (స్టేట్) నకు ప్రవేశము; నూతన రాష్ట్రస్థాపన; నూతనరాష్ట్రముల నిర్మాణము; ప్రస్తుతపు రాష్ట్రమునకు చెందిన విస్తీర్ణములును, సరిహద్దులును, పేర్లును అవసరమైనపుడు మార్చుట.

## రెండవ భాగము

### పౌరసత్వము.

రాజ్యాంగ ప్రణాళిక ఆరంభకాలమునందు పౌరస్వత్వము, పాకిస్థానమునుండి భారతదేశమునకు వలస వచ్చిన వారికి పౌరస్వత్వపు హక్కులు; పాకిస్థానమునకు వలసవెళ్ళినవారి పౌరస్వత్వపు హక్కులు; విదేశములందు నివసించు భారతీయుల పౌరస్వత్వపుహక్కులు.

## మూడవ భాగము.

### ప్రాతిపదిక స్వత్వములు—సమానత్వపు హక్కు.

చట్టములవిషయమున సమానత్వము, మత, జాతి, వర్ణ, లింగ, దేశభేదములపై నాధారపడిన పక్షపాతములకు నిషే

ధము. ఉద్యోగ విషయమున సమానావకాశములు అస్పృ
శ్యతా నిషేధము; బిరుదుల తొలగింపు.

స్వేచ్ఛవిషయమున హక్కు:— వాక్స్వాతంత్ర్యము,
వ్యక్తిస్వాతంత్ర్యము మొదలగు విషయములందు హక్కులరక్షణ.
నేరస్థుల అరెస్టు, శిక్ష మున్నగు వాని సందర్భమున రక్షణ.

బలవంతులపీడనుండి సంరక్షణబొందు హక్కు:—వ్యభి
చారము, నిర్బంధ సేవ, యంత్రాగారములలో బాలబాలిక
లచే పనిచేయించుట—మున్నగు అమానుషకృత్యముల నుండి
సంరక్షణ.

మతస్వేచ్ఛహక్కు:— మతము నవలంభించుటలోను,
ప్రచారము చేయుటలోను, మతసంబంధమగు పన్నులు చెల్లిం
చుటలోను, విద్యాసంస్థలలో మతబోధను వినుటయందును
స్వాతంత్ర్యము.

సాంస్కృతిక స్వేచ్ఛ:— అల్పసంఖ్యాకులహక్కుల సంర
క్షణ. అల్పసంఖ్యాకులు విద్యాసంస్థలు నిర్వహించుటకు
స్వాతంత్ర్యము

ఆస్తి హక్కు.

శాసనరీత్యా సౌకర్యములు పొందుహక్కు:—ఈభాగమున
నుదహరింపబడిన హక్కులు క్రమముగా అమలుజరుగుటకున్న

సైనికుల విషయమున ఈ హక్కులు వర్తించుటలో కొన్ని మార్పులు చేయుటకును, ఏప్రాంతమందైనను సైనిక శాసనములలో నున్నచో ఈహక్కులు వర్తింపకుండునట్లు శాసించుటకును, పార్లమెంటునకుగల అధికారములు.

## నాల్గవ భాగము.

### రాజ్యాంగ విధానమునకుచెందిన ఆదేశ సూత్రములు.

ఈభాగమునందలి సూత్రముల అనువర్తన, ప్రజాశ్రేయోభివృద్ధి కవసరమగు సాంఘిక వ్యవస్థ నిర్మాణము, గ్రామ పంచాయతీలు, విద్యాపోషణము, కార్మికులకు న్యాయమైనవియు, దయాదాక్షిణ్యముతో గూడినవియు నగు షరతులు లభింపజేయుట, కార్మికులకు జీవనభృతి లభించునట్లు చేయుట, పౌరుల కందరకును ఒకే న్యాయ శాసనము వర్తింపజేయుట, పిల్లలకు నిర్బంధోచిత విద్య లభింపజేయుట, వెనుకబడియున్న వర్ణములకును, జాతులకును చెందియున్న ప్రజల విద్యయు, ఆర్థికస్థితియు పెంపొందించుట, ప్రజల శరీరపోషణ, జీవన ప్రమాణము, ఆరోగ్యమును పెంపొందించుటలో ప్రభుత్వపు బాధ్యత, వ్యవసాయమును, పశుపోషణయు వృద్ధిచేయుట, పురాతన వస్తువులను భవనములను సంరక్షించుట, న్యాయ కార్యనిర్వాహక శాఖల విభజన, అంతర్జాతీయ శాంతి భద్రతల కాపాడుట.

## అయిదవ భాగము.

## యూనియన్ (సమాఖ్య)

### మొదటి అధ్యాయము – కార్యనిర్వాహకవర్గము.

ప్రెసిడెంటు (అధ్యక్షుడు), వైస్ ప్రెసిడెంటు (ఉపాధ్యక్షుడు) భారతదేశపు అధ్యక్షుడు—యూనియనుకు గల కార్యనిర్వాహణాధికారము— అధ్యక్షుని ఎన్నిక—అధ్యక్షుని ఉద్యోగకాలము—అధ్యక్షుని కుండదగు యోగ్యతలు, విధులు.

భారతదేశపు ఉపాధ్యక్షుడు—ఎన్నిక, ఉద్యోగకాలము, విధులు, మంత్రివర్గము, ప్రధానమంత్రి, భారతదేశపు అటార్నీ జనరల్; భారత ప్రభుత్వ కార్యనిర్వహణము.

### రెండవ అధ్యాయము—పార్లమెంటు.

పార్లమెంటు నిర్మాణము (i) స్టేట్సుకౌన్సిలు (ii) ప్రజాసభ. పార్లమెంటు సభల కాలపరిమితి—పార్లమెంటు సభ్యత్వమునకు యోగ్యతలు — సభాసమావేశములు — అధ్యక్షుని ఆరంభోపన్యాసము.

### మూడవ అధ్యాయము – పార్లమెంటు ఉద్యోగులు.

స్టేట్సు కౌన్సిలునకు పీఠపతి (చెయిర్మను) ఉపపీఠపతి (డెప్యూటీ చెయిర్మను) ప్రజాసభకు సభాపతి (స్పీకర్) ఉపసభాపతి (డెప్యూటీస్పీకర్) చెయిర్మను, డెప్యూటీచెయిర్మను, స్పీకర్

డెప్యూటీస్పీకర్ల జీతములు, అలవెన్సులు—పార్లమెంటు ఉద్యోగవర్గము.

పార్లమెంటుసభ్యుల అనర్హతలు.

పార్లమెంటునకును, పార్లమెంటు సభ్యులకును గల ప్రత్యేకాధికారములు, ప్రత్యేక మర్యాదలు — పార్లమెంటు సభ్యుల జీతబత్తెములు, పార్లమెంటునందు బిల్లు ప్రతిపాదన, తీర్మానము, పార్లమెంటునం దుపయోగింపబడదగు భాష, పార్లమెంటు చర్చలకుగల పరిమితి.

నాల్గవ అధ్యాయము- న్యాయపరిపాలకవర్గము.

సుప్రీంకోర్టు స్థాపన, నిర్మాణము, న్యాయమూర్తుల జీతములు, ప్రధానన్యాయమూర్తి, సుప్రీంకోర్టునకు అధికారములు, బాధ్యతలు.

అయిదవ అధ్యాయము:— భారత దేశపు కంప్ట్రోలర్ ఆడిటర్ జనరల్ విధులు, అధికారములు, ఆడిట్ రిపోర్టులు (ప్రభుత్వపు ఖర్చువెచ్చములు తనిఖీ)

ఆ ర వ భా గ ము

మొదటి షెడ్యూలులో ఎ. భాగమున నుదహరింపబడిన రాష్ట్రములు (స్టేట్స్)

మొదటి అధ్యాయము - సామాన్యవిషయములు. నిర్వచనము.

రెండవ అధ్యాయము - కార్యనిర్వాహకవర్గము

గవర్నరు, నియామకము, ఉద్యోగకాలపరిమితి, అర్హతలు విధులు, అధికారములు.

మంత్రివర్గము: అడ్వొకేటు జనరలు, రాష్ట్రీయప్రభుత్వ కార్యక్రమము కొనసాగించు విధానము, రాష్ట్రీయ ప్రధాన మంత్రి విధులు, బాధ్యతలు

మూడవ అధ్యాయము:-రాష్ట్రీయశాసననిర్మాణవర్గము.

రాష్ట్రీయశాసనసభల నిర్మాణము, లెజిస్లేటివ్ అసెంబ్లీ, లెజిస్లేటివ్ కౌన్సిల్, రాష్ట్రీయశాసన సభల కాలపరిమితి సభ్యుల అర్హతలు, గవర్నరు ప్రత్యేకోపన్యాసము.

రాష్ట్రీయ శాసనసభల ఉద్యోగి వర్గము:—లెజిస్లేటివ్ అసెంబ్లీలో స్పీకరు, డెప్యూటీస్పీకరు, లెజిస్లేటివు కౌన్సిలునకు చెయిర్మను, డెప్యూటీ చెయిర్మన్, స్పీకరు, డెప్యూటీస్పీకరు, చెయిర్మను, డెప్యూటీచెయిర్మనుల జీత బత్తెములు, రాష్ట్రీయ శాసనసభలకును, అందలి సభ్యులకును గల ప్రత్యేక మర్యాదలు, సభ్యుల జీతబత్తెములు.

రాష్ట్రీయ శాసనసభలలో శాసననిర్మాణ కార్యక్రమవిధానము.

అయిదవ అధ్యాయము - రాష్ట్రములలోని హైకోర్టులు.

హైకోర్టుల నిర్మాణము, న్యాయమూర్తుల నియామకము. వారివిధులు, నిషేధములు, జీతములు.

ఆరవ అధ్యాయము_దిగువకోర్టులు.

జిల్లాజడ్జిల నియామకము, ఇతరన్యాయాధిపతుల నియామకము, దిగువకోర్టులపై తనిఖీ.

## ఏ డ వ భా గ ము.

మొదటి షెడ్యూలులోని బి. భాగమునందలి రాష్ట్రములు. ఆరవభాగమునందలి సూత్రములు, మొదటి షెడ్యూలులోని బి. భాగమునందలి రాష్ట్రములకు వర్తింపజేయుట.

## ఎ ని మి ద వ భా గ ము.

మొదటి షెడ్యూలులోని సి. భాగమునందలి రాష్ట్రములు.

మొదటి షెడ్యూలులోని సి. భాగమునందలి రాష్ట్రముల పరిపాలనాక్రమము, స్థానికశాసననిర్మాణసభలను, మంత్రివర్గములను నిర్మించుట, ఈరాష్ట్రములకు హైకోర్టులు, కూర్గు.

## తొ మ్మి ద వ భా గ ము.

మొదటి షెడ్యూలులోని డి. భాగమునందలి ప్రాంతములును, ఇందుదహరింపబడని ఇతరప్రాంతములును డి. భాగమున నుదహరింపబడిన ప్రాంతముల పరిపాలనాక్రమము.

## ప ది య వ భా గ ము

షెడ్యూలుప్రాంతములు కొండజాతుల ప్రాంతములు

షెడ్యూలుకు ప్రాంతముల యొక్కయు, కొండజాతుల ప్రాంతముల యొక్కయు పరిపాలనాక్రమము.

## పదునొకండవ భాగము.

### యూనియనునకు, రాష్ట్రములకును (స్టేట్లకును) గలసంబంధములు.

మొదటి అధ్యాయము, శాసననిర్మాణసంబంధములు పార్లమెంటు (యూనియను శాసనసభ) ను, రాష్ట్రీయ శాసన సభలును చేయు శాసనముల అంశములు, అవి వర్తించు ప్రాంతములు; ప్రత్యేక అసాధారణ పరిస్థితులలో రాష్ట్రముల విషయమునగూడ శాసనములు చేయుటకు పార్లమెంటునకు గల అధికారములు.

రెండవఅధ్యాయము—పరిపాలనాసంబంధములు.

యూనియనునకు రాష్ట్రములు (స్టేట్లు) పైగల అధికారములు; నదీప్రవాహముల విషయమైగల తగాదాల పరిష్కారము; వివిధరాష్ట్రములమధ్య సంయుక్తసంఘముల నేర్పరచుట.

## పండ్రెండవ భాగము

### ఆర్థికవిషయములు, ఆస్తులు, కంట్రాక్టులు, దావాలు

మొదటి అధ్యాయము, ఆర్థిక విషయములు పన్నులు, యూనియనునకును రాష్ట్రములకును ఉమ్మడి విధులు, యూనియనుచే వసూలుచేయబడి రాష్ట్రములకు పంపిణీయగు పన్నులు, స్టేట్లకు యూనియను ఇచ్చు గ్రాంటులు. వృత్తివ్యాపారములపై పన్నులు, ఆర్థికసంఘము (ఫైనాన్షియల్ కమిషన్ పన్నుల మినహాయింపు, సంస్థానాధీశుల సొంతరాబడి.

రెండవ అధ్యాయము—ఋణము చేయుట.

యూనియను అప్పులు, రాష్ట్రముల అప్పులు.

మూడవ అధ్యాయము:—కంట్రాక్టులు, దావాలు ఆస్తికి వారసత్వము, ఆస్తిసంపాదనహక్కు, కంట్రాక్టులు, దావాలు.

పదమూడవ భాగము

దేశీయ, విదేశీయ వ్యాపారములు.

వ్యాపారమునస్వేచ్ఛ, వ్యాపార నిర్బంధములు విధించుటకు పార్లమెంటుకుగల అధికారము.

పదునాల్గవ భాగము.

యూనియనుక్రిందను, రాష్ట్రములక్రిందను పనిచేయు ఉద్యోగిబృందము.

మొదటి అధ్యాయము—ఉద్యోగి బృందము.

ఉద్యోగములలో చేర్చుకొనుట, ఉద్యోగ నియమములు, ఉద్యోగకాలము, ఉద్యోగమునుండి తొలగింపు, ఇతర విధములగు శిక్షలు.

రెండవ అధ్యాయము—పబ్లిక్ సర్వీస్ కమిషన్.

యూనియన్, రాష్ట్రీయ పబ్లిక్ సర్వీస్ కమిషనులు, వాని అధికారములు, విధులు, వానిఖర్చులు, నివేదికలు.

## పదునయిదవ భాగము.

### ఎన్నికలు.

ఎన్నికలు నడపించుటకు కమిషను, వయోజన వోటింగుహక్కు ననుసరించి ఎన్నికలు.

## పదునారవ భాగము.

### కొన్ని తరగతులకు సంబంధించిన ప్రత్యేకనియమములు.

ప్రజాసభలో వెనుకబడిన జాతులవారికి కొన్నిస్థానములు ప్రత్యేకించుట-ఉద్యోగములలో వెనుకబడిన జాతులకును, కొండజాతులకును కొన్ని ప్రాంతములు ప్రత్యేకించుటలో హక్కులు.

## పదునేడవ భాగము.

### రాజకీయ భాష.

మొదటి అధ్యాయము – యూనియను రాజకీయభాష.

రెండవ అధ్యాయము – ప్రాంతీయభాషలు.

మూడవ అధ్యాయము – సుప్రీంకోర్టు హైకోర్టుల భాషలు.

నాలుగవ అధ్యాయము – ప్రత్యేకాదేశములు.

## పదునెనిమిదవ భాగము.

### అసాధారణాధికారము.

విదేశ శత్రువులనుండియు, దేశమంకలి అల్లకల్లోలముల నుండియు రక్షణయేర్పరచుటకును, ఆర్థికక్లిష్ట పరిస్థితులలోను యూనియనునకు అసాధారణాధికారము.

## పందొమ్మిదవ భాగము.

### నానావిధ విషయములు.

రాజప్రముఖులు యొక్కయు, సంస్థానాధీశుల యొక్కయు ప్రత్యేకపు హక్కులును, మర్యాదలును, ఓడరేవులు, విమానాశ్రయములును మున్నగువానికి సంబంధించిన ప్రత్యేక నియమములు.

## ఇరువదియవ భాగము.

### రాజ్యాంగప్రణాళికకు సవరణ.

రాజ్యాంగ ప్రణాళిక సవరణ కనుసరింపవలసిన విధాము.

## ఇరువదియొకటవ భాగము

### తాత్కాలిక నిబంధనలు

పార్లమెంటు, అధ్యక్షుడు మున్నగు ఉన్నతాధికారులకుగల ప్రత్యేక తాత్కాలికాధికారములు, ఎన్నికలు జరుపుటలోను ఆర్థికవిషయములలోను తాత్కాలిక నిబంధనలు.

## ఇరువదిరెండవ భాగము

### సూక్ష్మనామము, ఆరంభము రద్దు

## షెడ్యూలులు

మొదటి షెడ్యూలు—రాష్ట్రీకులు, ప్రాంతములు

రెండవ షెడ్యూలు

ఎ. భాగము:— అధ్యక్షునకును, గవర్నరులకును సంబంధించిన నిబంధనలు.

బి. భాగము:- మంత్రులకు సంబంధించిన నిబంధనలు.

సి. భాగము:- స్పీకరు, డిప్యూటీ స్పీకరు మున్నగు వారికి చెందిన నిబంధనలు.

డి. భాగము:- జడ్జిలకు చెందిన నిబంధనలు

ఇ. భాగము:- కంప్ట్రోలర్ ఆడిటర్ జనరలుకు చెందిన నిబంధనలు.

మూడవ షెడ్యూలు- ప్రమాణము

నాల్గవ షెడ్యూలు:- కౌన్సిల్ ఆఫ్ స్టేట్సులో స్థానముల పంపకము.

ఐదవ షెడ్యూలు:- వెనుకబడిన జాతుల పరిపాలనా నిబంధనలు.

ఆరవ షెడ్యూలు:- అస్సాంకొండ జాతుల పరిపాలనా నిబంధనలు.

ఏడవ షెడ్యూలు:- యూనియనులిస్టు, స్టేటులిస్టు, ఉభయ ప్రభుత్వముల లిస్టు.

ఎనిమిదవ షెడ్యూలు:- భాషలు.

---

[2]

# పీ ఠి క

భారతదేశ ప్రజలమైన మేము భారతదేశమొక సర్వ స్వతంత్రమగు ప్రజాసత్తాక రాజ్యముగ నుండవలెనని సాంఘిక, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యమును మనోవాక్కాయ మత పూజా స్వేచ్ఛయు ప్రతిపత్తి అవకాశములలో సమానత్వమును భారతపౌరులకందరకు నుండవలెననియు భారతీయులందరిలోను వ్యక్తిగాంభీర్యముతోను, జాతీయైక్యతతోను గూడిన సోదర భావము పెంపొంద వలెననియు, మనస్ఫూర్తిగా తీర్మానించు కొంటిమి. 1949 వ సంవత్సరం నవంబరు నెల ఇరువదియారవ తేదీని మా రాజ్యాంగ పరిషత్తులో ఈరాజ్యాంగ ప్రణాళికను మేమంగీకరించి, శాసనముగా జేసి స్వాయత్తము చేసికొను చున్నాము.

శ్రీ

# భారత రాజ్యాంగ ప్రణాళిక

## మొదటి భాగము.

### యూనియను; యూనియనుకు చెందిన ప్రాంతము.

#### నిబంధన.

1 ఇండియా, అనగా భారతదేశము, రాష్ట్రములు (స్టేట్లు) సమాఖ్య (యూనియను) యై యుండును.

భారతదేశమందలి రాష్ట్రములును ప్రాంతములును మొదటి షెడ్యూలు ఎ. బి. సి. భాగములలో నుదహరింపబడినవియై యుండును. ఇండియా రాజ్యమనగా (i) రాష్ట్రములు (స్టేట్లు) (ii) మొదటి షెడ్యూలులోని డి. భాగమున నుదహరింపబడిన ప్రాంతములు (iii) మున్ముందు సేకరింపబడు ప్రాంతములును కలసియేర్పడిన రాజ్యము.

2 భారత సమాఖ్యలోనికి క్రొత్తరాష్ట్రములను శాసనరీత్యా పార్లమెంటు అవసరమగు షరతులమీద చేర్చుకొనవచ్చును. లేదా శాసనరీత్యా క్రొత్తరాష్ట్రములను పార్లమెంటు స్థాపింపవచ్చును.

3 తగిన శాసనమూలమున పార్లమెంటు క్రింద నుదహరింపబడిన చర్యలు జరుపవచ్చును.

(i) ఇప్పుడున్న రాష్ట్రములనుండి విడదీయుటచేగాని, కొన్ని రాష్ట్రములను కలుపుటచేగాని, ఒక రాష్ట్రమునుండి కొంతభాగమును, మరియొక రాష్ట్రమునుండి కొంత భాగమును చేర్చుటచేగాని నూతన రాష్ట్రము నిర్మింప వచ్చును.

(ii) ఒక రాష్ట్రపు విస్తీర్ణము తగ్గింప వచ్చును, లేక హెచ్చింప వచ్చును.

(iii) రాష్ట్రముల సరిహద్దులను, పేరులను మార్చవచ్చును. ఇట్టిమార్పులు చేయునపుడు ఆయామార్పులకు లోబడు రాష్ట్రములందలి శాసననిర్మాణసభ్యుల యభిప్రాయములను తెలిసికొని మార్పును ప్రసాదించు బిల్లును ప్రెసిడెంటు సిఫారసు చేయవలసియుండును.

4 పైన 2, 3 నిబంధనలను బట్టి అవసరమగు శాసనములలో మొదటి షెడ్యూలులోను, నాల్గవ షెడ్యూలులోను తగువిధమున సవరణలు చేయబడవలెను.

## రెండవ భాగము

## పౌరస్త్వము

5. ఈ రాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి వచ్చుసరికి

(i) ఇండియారాజ్యమున స్థిరనివాసము గలిగినట్టియు

(ii) ఇండియారాజ్యమున జన్మించినట్టియు

(iii) తలిదండ్రులలో నొకరు ఇండియా రాజ్యమున జన్మించినట్టియు

(iv) ఈ రాజ్యాంగ ప్రణాళిక అమలు జరుగుటకు పూర్వము అయిదేండ్లు ఇండియా రాజ్యమున నివసించినట్టియు స్త్రీ పురుషులందరును భారత దేశపు పౌరులగుదురు.

6 అయిదవ నిబంధనలోని అంశములతో నెట్టి నిమిత్తమును లేకుండా, ప్రస్తుతము పాకిస్థానులో చేరిన ప్రాంతమునుండి వలసవచ్చినవారు దిగువ నుదహరింపబడిన షరతులకు లోబడి భారత దేశ పౌరులుగా పరిగణింప బడుదురు.

(i) ఆ వ్యక్తిగాని, ఆ వ్యక్తి తలితండ్రులలో నొకరుగాని, తాత అవ్వలలో నొకరుగాని ఇండియాలో జన్మించి యుండవలెను.

(ii) 1948 సంవత్సరం జూలై 19 వ తేదీకి పూర్వము వలసవచ్చినయెడల ఆ తేదీకి పూర్వము ఇండియా రాజ్యమున సాధారణముగా నివాసముగల్గి యుండ వలెను. 1948 సం॥ జూలై 19 వ తేదీ పిదప వలస వచ్చినచో తగిన ఉద్యోగియెదుట ఇండియా పౌరుడుగ రిజస్టరు చేయించుకొనవలెను. ఇట్లు రిజస్టరు చేయించు కొనుటకుపూర్వము భారత దేశమున ఆరునెలలు నివ సించి యుండవలెను.

7 1947 సం॥ మార్చి 1 వ తేదీ పిదప భారతదేశమునుండి పాకిస్థానమునకు వలసవెళ్లినవారు ఇండియా పౌరులుగ పరిగణింపబడరు.

కాని న్యాయసమ్మతమగు అనుమతిపొంది పాకిస్థాను నుండి తిరిగివచ్చి భారతదేశమున స్థిరనివాస మేర్పరచు కొనినవారు పౌరులుగ పరిగణింపబడుదురు.

8 ఏవ్యక్తియైనను తన తలిదండ్రులలో నొకరుగాని, తాత అవ్వలలో నొకరుగాని భారతదేశమున జన్మించినవారై తాను సాధారణముగా విదేశములలో నివసించుచున్నప్పటి కిని ఆదేశమందలి భారతరాయబారి కార్యాలయమున తగినవిధమున రిజస్టరుచేయించుకొనినచో అట్టి వ్యక్తి భారతపౌరుడుగనే పరిగణింపబడును.

9 ఏ విదేశరాజ్యమునందైనను బుద్ధిపూర్వకముగ పౌరసత్వ్వ ముపొందిన వ్యక్తి పైనిబంధనల ననుసరించి భారతపౌరుడుగ పరిగణింపబడడు.

10 పైనిబంధనల ననుసరించి భారతపౌరుడైన వ్యక్తియు, భారతపౌరుడుగ పరిగణింపబడిన వ్యక్తియు పార్లమెంటు చేయు శాసనములకు లోబడి పౌరసత్వ్వమును గల్గి యుండును.

11 ఒక వ్యక్తికి పౌరసత్వ్వము గలిగించుటకుగాని, రద్దుచే యుటకుగాని పై నిబంధనలతో నెట్టి నిమిత్తమునులేకుండ పార్లమెంటునకు అధికారము గలదు.

## మూడవ భాగము.

### ప్రాతిపదికమగు హక్కులు.

12 ఈభాగమున స్టేటు (రాజ్యాంగము) అను పదము కేంద్రి రాష్ట్రీయ ప్రభుత్వములను, పార్లమెంటును, రాష్ట్రీయ శాసన సభలకును, స్థానిక ప్రభుత్వాధికారులకును వర్తించును.

13 ఈరాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి వచ్చుసరికి భారత దేశమునగల శాసనములలో ఈభాగమందలి నిబంధనలకు వ్యతిరేకముగనున్న శాసనము లింతటితోండి రద్దగును.

ఈభాగమునందలి నిబంధనలవలన గల్గు హక్కులకు భంగకరముగా స్టేటు (రాజ్యాంగము) ఏశాసనమైనను చేసినచో అట్టి శాసనము చెల్లనేరదు.

శాసనము అనగా అసాధారణ శాసనము (ఆర్డినెన్సు) ఉత్తరువు, ఉప నిబంధన మొదలగువానికిగూడ వర్తించును.

14 భారత దేశమందలి ఏవ్యక్తికైనను న్యాయశాసనము లన్నియు ఏక సమానముగనే వర్తించును. ఏవ్యక్తికైనను న్యాయశాసనములవలన సరిసమానమగు రక్షణ యుండును. అట్టి సరిసమానపుహక్కును ప్రభుత్వము తొలగింపరాదు.

15 మత, జాతి, వర్ణ, లింగ, జన్మస్థలముల భేదములనుబట్టి ప్రభుత్వము ఏపౌరుని యెడలను పక్షపాతము చూపరాదు.

మత, జాతి, వర్ణ, లింగ, జన్మస్థల కారణములచే నేవ్యక్తిని అంగడులలోనికిగాని, ఫలాహార శాలలలోనికిగాని,

భోజనశాలలోనికిగాని, వినోదమందిరములకుగాని ప్రవేశము లేకుండ చేయరాదు. ప్రభుత్వ ధనసహాయము పొందుచు ప్రజోపయోగము కొరకుద్దేశింపబడిన నూతులు, చెరువులు, స్నానశాలలు, రోడ్లు మొదలగు స్థలము లుపయోగింపకుండ ఏవ్యక్తియును ఆటంకపరుపబడరాదు.

స్త్రీలకును, పిల్లలకును, సౌకర్యముకొరకు ప్రభుత్వము పై నిబంధనలతో నిమిత్తములేక ఏ ప్రత్యేక నియమములైనను చేయవచ్చును.

16 ప్రభుత్వపు ఆధీనముగల ఏయుద్యోగవిషయమునందైనను పౌరుల కందరకును సమానావకాశము లుండవలెను. మత, జాతి, వర్ణ, లింగ, వంశ, జన్మస్థల, నివాసస్థలభేదములనుబట్టి ప్రభుత్వోద్యోగములలో నేవ్యక్తికిని అనర్హతగాని, పక్షపాతముగాని యేర్పడరాదు.

కాని జన్మస్థలము విషయమునగాని, మత విషయమున గాని కొన్ని ఉద్యోగములకు నియమము లేర్పరచుటలోను వెనుకబడిన జాతులకు న్యాయము గల్గించుటకై కొన్ని పదవులు వారికి ప్రత్యేకించుటలోను ప్రభుత్వమున కధికారము గలదు.

17 అస్పృశ్యత అనునది రద్దు చేయబడినది. ఏరూపములోనైనను అస్పృశ్యతను పాటింపరాదు. అస్పృశ్యతను పాటించి ఏవ్యక్తికైనను ఇబ్బంది గల్గించినవారు శాసనరీత్యా శిక్షార్హులగుదురు.

18 ప్రభుత్వము ఎట్టి బిరుదులను ఒసగబోదు. భారతపౌరు లెవరును విదేశప్రభుత్వపు బిరుదులు స్వీకరింపరాదు. భారతపౌరుడు కాకపోయినను భారతప్రభుత్వమునకు లోబడిన ఉద్యోగమున నున్నంతకాలమును భారతప్రజా సత్తాకపు అధ్యక్షుని అనుమతిలేనిదే విదేశప్రభుత్వమునుండి బిరుదులుగాని, బహుమతులుగాని స్వీకరింపరాదు.

19 పౌరులకందరకును దిగువ నుదహరింపబడిన విషయములలో స్వేచ్ఛయుండును.

(i) వాక్స్వాతంత్ర్యము, భావప్రకటన స్వాతంత్ర్యము.

(ii) నిరాయుధులుగానుండి శాంతియుత సమావేశము జరుపుకొనుటలో స్వేచ్ఛ.

(iii) సంఘములుగను, సమితులుగను ఏర్పడు స్వేచ్ఛ.

(iv) ఇండియా రాజ్యమున నిరాటంకముగ సంచరించుటలో స్వేచ్ఛ.

(v) ఇండియారాజ్యమున స్థిరనివాస మేర్పరచుకొనుటకు స్వేచ్ఛ.

(vi) ఆస్తి సంపాదన, ఆస్తిఅనుభవము, ఆస్తి వినిమయములలో స్వేచ్ఛ.

(vii) వృత్తి వ్యాపారముల నవలంభించుటలో స్వేచ్ఛ.

కాని సంఘమర్యాదలను నీతిని కాపాడుటకును, శాంతి భద్రతల సంరక్షించుటకును, కొన్నివృత్తివ్యాపారముల కవసరు

మగు అర్హతలు నిర్ణయించుటకును ప్రభుత్వమున కెట్టి యభ్యంతరమును లేదు.

20 ఏవ్యక్తియు శాసనమునకు భిన్నముగా శిక్షింపబడరాదు. ఒక నేరమున కొకసారికంటె నెక్కువసార్లు శిక్షింపబడరాదు. నేరారోపణ చేయబడిన ఏవ్యక్తియు తనకు వ్యతిరేకముగా సాక్ష్యమీయవలెనని నిర్బంధింపబడరాదు.

21 న్యాయ శాస్త్ర విరుద్ధముగా ఏ వ్యక్తి ప్రాణమును హరింపబడరాదు. ఎవరివ్యక్తిస్వాతంత్ర్యమునకును భంగము కల్గింపరాదు.

22 ఏవ్యక్తిని కారణములు సాధ్యమైనంత త్వరలో తెలుపనిదే అరెస్టు చేయరాదు. అరెస్టుచేయబడిన ఏవ్యక్తికైనను తానుకోరిన న్యాయవాది సలహాపొందుటకు స్వేచ్ఛయుండవలెను. అరెస్టుచేయబడినవ్యక్తిని ఇరువదినాల్గు గంటలకాలములో మేజస్ట్రేటు నెదుట హాజరుపరుపవలెను. మేజస్ట్రేటు అనుమతిలేనిదె అంతకంటె ఎక్కువ కాలము నిర్బంధింపరాదు. నేరమును నిరోధించుటకు ప్రత్యేక పరిస్థితులలో నే వ్యక్తులనైనను ఎక్కువకాలము నిర్బంధించుటకును అందుకు తగిన ప్రత్యేక నియమము లేర్పరచుటకును ప్రభుత్వమున కెట్టి యాటంకమును లేదు.

23 మానవులను నిర్బంధించి నౌకరీచేయించుటగాని, ఇతర

విధముల నిర్బంధించి అక్రమలాభము పొందుటగాని న్యాయరీత్యా శిక్షార్హమైన నేరము.

అవసర పరిస్థితులలో సంఘక్షేమముకొరకు నిర్బంధముగా సేవచేయించు అధికారము ప్రభుత్వమునకుగలదు.

24 పదునాలుగేండ్ల వయసునకు లోబడిన బాలబాలికలను యంత్రాగారములలోను, గనులలోను, ఇతరమగు ప్రమాదకరమైన పనులలోను నియమింపరాదు.

25 ప్రజాశాంతికిని, నీతికిని, ఆరోగ్యమునకును భంగము లేనంత వరకు ఏవ్యక్తికైనను తన కిష్టమగు మత మవలంభించుటకును ప్రచారము చేయుటకును హక్కుగలదు.

సంఘక్షేమమున కవసరమగు మతసంబంధ విషయములలో ప్రభుత్వము తగిన చర్యల నవలంబించుట కెట్టి యాటంకము నుండదు.

26 ప్రజాశాంతికిని, నీతికిని, ఆరోగ్యమునకును భంగము లేనంత వరకును ఏ మతమునకు చెందినవారైనను స్థిరచరాస్తిరూపములగు ధర్మసంస్థలు నిర్వహించుకొనవచ్చును.

27 ప్రత్యేకముగా ఒక మతమును ప్రోత్సహించుటకై ఏవ్యక్తిని నిర్బంధించి ఎట్టి పన్నును వసూలుచేయరాదు.

28 పూర్తిగ ప్రభుత్వ ధన సహాయముపొందు ఏవిద్యాసంస్థయందును మతసంబంధమగు విద్య బోధింపరాదు. మైనరులగు విద్యార్థులకు సంబంధించిన సంరక్షకుల అనుమతిలే

నిదే వారిని మతబోధలోగాని పూజలోగాని పాల్గొన వలెనని నిర్బంధింపరాదు.

కేవలము మతబోధకొరకు ఏర్పడిన ధర్మాదాయముల సహాయము నడుపబడు సంస్థలకు మత విద్యాబోధ కూడదను నియమము వర్తింపదు.

29 భారత దేశమున నివసించు ఏపౌరుల సముదాయమైనను తన భాషాలిపి సంస్కృతుల విశిష్టతను కాపాడుకొనుటకు హక్కుగలిగియుండును. ప్రభుత్వముచేగాని ప్రభుత్వ ధన సహాయముచేగాని నిర్వహింపబడు విద్యాసంస్థలలో నేవ్యక్తికిని మత, జాతి, వర్ణ భాషాభేద కారణములచే ప్రవేశము లేకుండ చేయరాదు.

30 మత భాషా విషయముల మూలముగ నేర్పడిన అల్పసంఖ్యాకవర్గములవారికి తాముకోరిన రీతిని విద్యాసంస్థలు నిర్వహించుకొనుటకు హక్కుగలదు.

మత భాషా మూలకములగు అల్పసంఖ్యాకవర్గములచే నిర్వహింపబడు విద్యాసంస్థల విషయమై ధనసహాయముచేయుటలో ప్రభుత్వము పక్షపాతము చూపరాదు.

31 న్యాయశాసనాధికారముగల సందర్భములలో తప్ప ఏవ్యక్తి ఆస్తికిని భంగము కలిగింపరాదు.

ఏకారణముచేతనైనను ఒకఆస్తిని ప్రభుత్వము శాసన రీత్యా వశపఱచుకొనదలచినచో ఆ ఆస్తి యజమానికీయనగు

నష్టపరిహారమును, వశపరచుకొనుటకు కారణములను ఆశాసనము నిర్దేశింపవలెను. అట్టి శాసనము భారతరిపబ్లికు అధ్యక్షుని అంగీకారము బడయవలెను.

32 ఈభాగమున (మూడవభాగమున) ఉదహరింపబడిన హక్కులు అమలు జరగునట్లు చేయుటకై క్రమపద్ధతుల ద్వారా సుప్రీంకోర్టుకు దరఖాస్తు పెట్టుకొనుటకు పౌరులకు హక్కుగలదు. తగువిధమగు ఉత్తరువు లొసగి ఈభాగమునగల హక్కులు అమలు జరిపించుటకు సుప్రీంకోర్టుకు అధికారము గలదు.

33 ప్రజాశాంతి కాపాడుటకై ప్రత్యేక పరిస్థితులలో నియమింపబడిన సైనికోద్యోగుల విషయమున ఈభాగమందు దుదహరింపబడిన హక్కు లెట్టి మార్పులుపొందదగునో ప్రత్యేక శాసనముద్వారా పార్ణమెంటు నిర్ణయింప వచ్చును.

34 సైనికశాసనము (మార్షల్ లా) అమలులోనున్న పరిస్థితులలో శాంతిరక్షణ సందర్భములో నుద్యోగులు విధించు శిక్షలు స్క్రమమని నిర్ణయించుటకు పార్లమెంటున కధికారము గలదు.

35 ఈభాగమున నుదహరింపబడిన నిబంధనలు అమలుజరుగునట్లు చేయుట కవసరమగు శాసనములు చేయుటకు పార్లమెంటుకేగాని, రాష్ట్రీయ శాసనసభలకు అధికారము లేదు.

## నాల్గవ భాగము.

### రాజ్యాంగనీతికి సంబంధించిన ఆదేశసూత్రములు.

36 ఈభాగమునందును స్టేట్ అను పదమునకు ప్రభుత్వమనియే యర్థము.

37 ఈభాగమునందలి నిబంధనల నమలుజరుపుటకు న్యాయస్థానముల కధికారము లేదుగాని, దేశపరిపాలనకివి ప్రాతిపదిక సూత్రములగుటచే శాసనములు చేయుటలో వీనిని వర్తింపజేయుట ప్రభుత్వపు విధియై యున్నది.

38 జాతీయ జీవితమునందలి అన్నిసంస్థలలోను సాంఘిక, రాజకీయ, ఆర్థిక విషయములందు న్యాయమే ప్రధానముగాగల సాంఘిక వ్యవస్థనేర్పరచి ప్రజాశ్రేయస్సును పెంపొందించుటకు ప్రభుత్వ మన్నివిధముల యత్నింపదగును.

39 ప్రభుత్వము క్రింది విషయములలో ప్రత్యేకశ్రద్ధ చూపవలెను—

(i) పౌరులందరకును (పురుషులైనను, స్త్రీలైనను) చాలునంతగ జీవనాధారము గల్గియుండవలెను.

(ii) సంఘక్షేమమును కాపాడుటకు తగినట్లుగ దేశసంపద వినిమయము (పంపకము) జరుగదగును.

(iii) దేశపు ఐశ్వర్యమును, ఉత్పత్తియు కొలదిమంది చేతులలో నుండిపోయి ప్రజాసామాన్యమునకు కీడుగలుగకుండ ఆర్థికవిధానమును సరియగు త్రోవను నడుపదగును.

(iv) పురుషులకును స్త్రీలకును సమానమగు శ్రమకు సమానమగు జీతము లభించునట్లు చూడదగును.

(v) కార్మికవృత్తి నవలంబించు స్త్రీ పురుషుల ఆరోగ్యమునకును, శరీరబలమునకును భంగము కలుగకుండునట్లును లేతవయసు బాలబాలికలు తమకలవిగాని వృత్తి నవలంభింపకుండునట్లును, మొత్తముమీద పౌరులెవ్వరును ఆర్థికదుస్థితిచేతను వయసునకును, ఆరోగ్యమునకును అలవిగాని వృత్తి నవలంభింపకుండునట్లును ప్రభుత్వము శ్రద్ధగైకొనవలెను.

(vi) నైతికముగను, ఆర్థికముగను బాలబాలికలును యువతీయువకులును హీనస్థితిని బొందకుండులాగున ప్రభుత్వము చూడవలెను.

40 గ్రామపంచాయతీల నేర్పరచి అవి స్వపరిపాలన జరపుకొనుటకు దగిన అధికారములు వానికి ప్రభుత్వము ఒసగదగును.

41 విద్యావ్యాపన, నిరుద్యోగ సమస్యాపరిష్కారము, వార్థక్యదశలో తోడ్పడుట, వ్యాధినివారణ, అంగవిహీనులకు

సహాయము మొదలగు విషయములలో ఆర్థిక పరిస్థితులననుకూలించినంతవరకు ప్రభుత్వము కృషిచేయదగును.

42 కార్మికులకు న్యాయమైనట్టియు దాక్షిణ్యముతో గూడినట్టియు షరతులపై యుద్యోగము దొరకునట్లు ప్రభుత్వముతోడ్పడవలెను.

43 వ్యవసాయపు కార్మికులకును, యంత్రాగార కార్మికులకును ఉచితమగు జీవనవ్యయమున కవసరమగు భృతియును, (కూలియును) పూర్తియగు విశ్రాంతియును, సాంఘిక వైజ్ఞానిక సౌకర్యములును కల్గునట్లును, ముఖ్యముగ గ్రామములలో గృహపరిశ్రమలు వ్యక్తిపరముగ గాని, సహకార విధానము మూలముగగాని పెంపొందునట్లును, ప్రభుత్వము కృషిచేయవలెను.

44 ఇండియా రాజ్యమంతటిలోను పౌరులందరికిని సరిసమానమగు న్యాయవిచారణ విధానము (సివిల్ కోడ్) అమలు జరగునట్లు ప్రభుత్వము కృషిచేయవలెను.

45 ఈరాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి వచ్చిన పదియేండ్లలో భారతదేశమున బాలబాలికలకందరకును పదునాలుగేండ్లు వయసు వచ్చువరకు నిర్బంధోచిత ప్రారంభవిద్య లభించునట్లు ప్రభుత్వము కృషిచేయవలెను.

46 సంఘమునందు బలహీనమైనట్టియు, వెనుకబడినట్టియు జాతుల విద్యాభివృద్ధికిని, ఆర్థికాభివృద్ధికిని తోడ్పడుటయే

గాక ముఖ్యముగ అట్టి జాతులకు సంఘమున నేట్టియన్యాయమును జరుగకుండ ప్రభుత్వము యత్నింపవలెను.

47 ప్రజల శరీర పోషణను, జీవితప్రమాణమును, ఆరోగ్యమును పెంపొందించుట ప్రభుత్వపు ప్రధానధర్మములుగ భావింపదగును. ముఖ్యముగ ప్రజారోగ్య భంగకరములగు మత్తు పదార్థముల యుపయోగమును ప్రభుత్వము నిషేధింపవలెను.

48 వ్యవసాయమును, పశుపోషణను ఆధునిక పద్ధతులపై వృద్ధి చేయుటయేగాక పశుసంతతిని పెంపొందించి, గోహత్యను ప్రభుత్వము మాన్పవలెను.

49 జాతీయ ప్రాముఖ్యముగలవియని పార్లమెంటు శాసించిన ప్రాచీన వస్తువులను, కళా సందర్భముగ గాని చారిత్రాత్మకముగాని ప్రాధాన్యముగల వస్తువులను ఎవరును దొంగిలింపకుండునట్లును, పాడుచేయకుండునట్లును, పై దేశముల కెగుమతి చేయకుండునట్లను కాపాడుట ప్రభుత్వ ముఖ్యవిధియై యున్నది.

50 ప్రభుత్వపు ఉద్యోగులలో న్యాయశాఖను, కార్యనిర్వాహక శాఖను వేరుచేయుటకు ప్రభుత్వము తగిన చర్యలను జరపవలెను.

51 అంతర్జాతీయ శాంతి భద్రతలు పెంపొందించుటకును, వివిధ జాతులమధ్య న్యాయమగునట్టియు, గౌరవప్రద మైనట్టియు

సంబంధములు నెలకొల్పుటకును అంతర్జాతీయ ధర్మశాస్త్రమును, శాంతి ఒడంబడికలందు గౌరవభావము వృద్ధి చేయుటకును, అంతర్జాతీయ వివాదములను మధ్యవర్తి మార్గమున పరిష్కరించుకొనునట్లును ప్రభుత్వము యత్నింపవలెను.

## అయిదవ భాగము

### యూనియన్ (సమాఖ్య)

### మొదటి అధ్యాయము – కార్యనిర్వాహకవర్గము

### అధ్యక్ష, ఉపాధ్యక్షులు.

### (ప్రెసిడెంటు, వైస్ప్రెసిడెంట్లు)

52 భారతదేశమున కొక అధ్యక్షుడు ప్రెసిడెంటు ఉండవలెను.

53 యూనియను (భారతసమాఖ్య) యొక్క కార్యనిర్వాహణాధికారము అధ్యక్షుని అధీనమున నుండును. ఆయధికారము అధ్యక్షుడు స్వయముగగాని, ఈరాజ్యాంగ ప్రణాళిక ననుసరించి అధ్యక్షునికిలోబడి పనిచేయుటకు నియమింపబడిన ఉద్యోగులద్వారాగాని నిర్వహింపవలెను; యూనియనుకు చెందిన దేశరక్షణసైన్యముల సర్వసైన్యాధిపత్యము అధ్యక్షుని అధీనమున నుండును. శాసనక్రమము ననుసరించి అధ్యక్షుడా యధికారమును నిర్వహించును.

శాసనరీత్యా రాష్ట్రములకు చెందు అధికారము ప్రెసిడెంటు అధీనము కానేరదు.

ఏ యధికారము నైనను అధ్యక్షుడుగాక ఇతరోద్యోగులకు పార్లమెంటు తగిన శాసనములద్వారా అధీనము చేయవచ్చును.

54 పార్లమెంటునందలి ఎన్నుకొనబడిన సభ్యులును, రాష్ట్రీయములందని లెజిస్లేటివ్ ఎసెంబ్లీల యందలి ఎన్నుకొనబడిన సభ్యులును చేరిన ఎన్నిక పరిషత్తుచే అధ్యక్షుడెన్నుకొనబడవలెను.

55 అధ్యక్షుని ఎన్నికలో సాధ్యమైనంతవరకు వివిధరాష్ట్రీయములకు సరిసమానమగు ప్రాతినిధ్యముండవలెను.

ప్రపోర్షనల్ రెప్రజెంటేషన్ విధానము ననుసరించి సింగిల్ ట్రాన్స్ఫరబల్ వోటు మూలమున రహస్యపు బాలటు పద్ధతి ననుసరించి అధ్యక్షుని ఎన్నిక జరుగవలెను.

56 ఉద్యోగము స్వీకరించిన తేదీనుండి అయిదేండ్లవరకు అధ్యక్షుండు పదవియందుండును.

(i) స్వదస్తూరీతో ఉపాధ్యక్షునికి (వైస్ ప్రెసిడెంట్) లేఖా ప్రాయుటమూలమున అధ్యక్షుడు అయిదేండ్లలో తన పదవికి రాజీనామా నీయవచ్చును.

(ii) రాజ్యాంగప్రణాళిక సూత్రములను భంగపరచినందులకు నేరారోపణచేసి పార్లమెంటు అధ్యక్షుని పదవినుండి తొలగింపవచ్చును.

(iii) అయిదేండ్ల కాలపరిమితి పూర్తి అయిన పిదపగూడ క్రొత్తగా అధ్యక్షపదవికి ఎన్నుకొనబడిన వ్యక్తి పదవి స్వీకరించువరకు ప్రాతఅధ్యక్షుడే పదవియందుండవలెను.

(iv) అధ్యక్షుని రాజీనామా లేఖను ఉపాధ్యక్షుడు తనకది యందినతోడనే ప్రజాసభ స్పీకరునకు (సభాపతికి) పంపవలెను.

57 ఒకసారి అధ్యక్షపదవిని నిర్వహించిన వ్యక్తి ఇతర నిబంధనలకులోబడి మరియొకసారి అధ్యక్షపదవి ఎన్నికకు పోటీచేయవచ్చును.

58 అధ్యక్షపదవికి పోటీచేయు వ్యక్తికి క్రిందినిబంధనలు వర్తించును. పోటీచేయువ్యక్తి.

(i) భారత పౌరుడై యుండవలెను.

(ii) ముప్పదియైదేండ్ల వయసుగల్గియుండవలెను.

(iii) ప్రజాసభయందు సభ్యుడుగనుండుట కర్హత గల్గియుండవలెను. కేంద్రరాష్ట్రీయ ప్రభుత్వములలో వేనిక్రిందనైనను జీతము తీసికొను ఉద్యోగులకు అధ్యక్షపదవికి పోటీచేయుట కర్హతలేదు. కాని యూనియన్ ప్రెసిడెంటు వైస్‌ప్రెసిడెంటులకును, గవర్నరు, రాజప్రముఖ ఉపరాజ ప్రముఖులకును, కేంద్రరాష్ట్రీయ మంత్రులకును-ఈ నిషేధము వర్తింపదు.

59 అధ్యక్షుడుగా నెన్నుకొనబడినవ్యక్తి కేంద్రరాష్ట్ర శాసనసభలలో వేనియందును సభ్యుడుగా నుండరాదు. ఒకానొకప్పుడు ఏ శాసనసభ్యుడైనను అధ్యక్షపదవి కెన్నుకొనబడినచో ఆవ్యక్తి అధ్యక్షపదవి స్వీకరించుటతోడనే శాసనసభయందతని స్థానము ఖాళీయగును.

అధ్యక్షుడుగానున్న వ్యక్తి జీతము తీసికొను మరియొక పదవియేదియు నిర్వహింపరాదు

పార్లమెంటు శాసనము మూలమున నిర్ణయింపబడు జీతము, అలవెన్సులు, ప్రత్యేకమర్యాదలును అధ్యక్షుడనుభవించుటకు హక్కు గల్గియుండును. అంతేగాక అద్దెయివనక్కర లేకుండనే ప్రభుత్వమునకు చెందిన నివాసభవన మువయోగింపవచ్చును. ఒక వ్యక్తి అధ్యక్షపదవియందుండగా ఆపదవికి సంబంధించిన జీతమును, అలవెన్సులును, ప్రత్యేక మర్యాదలును, తగ్గింపరాదు.

60 అధ్యక్షపదవిని నిర్వర్తించుటకు పూర్వము ఆపదవి నిర్వర్తించు వ్యక్తి సుప్రీంకోర్టు ప్రధానన్యాయమూర్తి యెదుట దిగువ చెప్పిన ప్రమాణము స్వీకరింపవలెను.

అధ్యక్షధర్మములను సక్రమముగ నిర్వహించెదననియు, రాజ్యాంగప్రణాళిక సూత్రములను సంరక్షించెద ననియు, భారతప్రజలకు సేవచేసెదననియు దేవుని యెదుట ప్రమాణము చేయుచున్నాను.

61 రాజ్యాంగ ప్రణాళికను భంగపరచెనని అధ్యక్షుని నేరారోపణచేయుటలో క్రింది విధాన మవలంబింపవలెను.

కేంద్రశాసన సభల రెండింటిలో నొకదానియందలి అధమము నాల్గవవంతు సభ్యులు సంతకముచేసిన నేరారోపణ తీర్మానమును ఆశాసన సభయందు ప్రవేశపెట్టవలెను. ఆశాసన సభలో మూడింట రెండువంతులు సభ్యు లంగీకరించిన

మీదట ఆతీర్మానము నగ్గినఖ్లించబడును. పిదప ఆనేరారోపణ తీర్మానమునందలి సత్యాసత్యములను రెండవశాసనసభవారు పరిశీలింపవలెను. స్వయముగ గాని మరియొక ద్వారాగాని తనపైగల నేరారోపణకు సమాధానము చెప్పుట కధ్యక్షునికి హక్కుండును. నేరారోపణ పరిశీలనచేసిన శాసన సభలో మూడింట రెండువంతులు సభ్యులు నేరారోపణ సక్రమమైన దని యంగీకరించిన మీదట అధ్యక్షుడుగానున్న వ్యక్తి తన పదవిని గోల్పోవును.

62 అధ్యక్షుని పదవికిగల అయిదేండ్ల పరిమితి పూర్తికాక పూర్వమే క్రొత్త అధ్యక్షుని ఎన్నిక జరుగవలెను. ఏకారణముచేతనైనను అయిదేండ్లలోపుననే అధ్యక్షపదవి ఖాళీయైనచో సాధ్యమైనంతత్వరలో తిరిగి యెన్నిక జరుగవలెను. ఎన్నిక జరుగవలసిన వ్యవధి ఆరునెలల కెప్పుడును మించరాదు.

63 భారతదేశమునకొక వైస్‌ప్రెసిడెంటు (ఉపాధ్యక్షుడు) ఉండవలెను.

64 ఉపాధ్యక్షుడు స్టేట్సుకౌన్సిలునకు చెయిర్మను (పీఠపతి) గా నుండును. ఉపాధ్యక్షుడుగ నున్న వ్యక్తి జీతము తీసికొను మరియే యుద్యోగమును చేయరాదు.

65 ఏకారణము చేతనైనను (మరణము, రాజీనామా) తొలగింపు అధ్యక్షపదవి ఖాళీయైనచో క్రొత్త యధ్యక్షు డెన్నుకొన

బడువరకు ఉపాధ్యక్షుడు అధ్యక్షుని విధులు నిర్వర్తింప వలెను. వ్యాధిచేగాని ఇతరకారణములచేగాని, అధ్యక్షుడు తన విధులు నెరవేర్ప లేకపోయినచో ఉపాధ్యక్షుడు అధ్యక్షువిధులు నిర్వర్తించును. ఆసమయమున ఉపాధ్యక్షునకు అధ్యక్షున కవలంభించు జీతమును అలవెన్సులును ప్రత్యేకమర్యాదలును లభించును.

66 పార్లమెంటునందలి రెండు శాసనసభ్యులును ఒక స్థలమున సమావేశమై ప్రపోర్షనల్ రిప్రజెంటేషను విధానము ననుసరించిన సింగిల్ ట్రాన్సఫరబుల్ వోటుపద్ధతిచే రహస్యపు బాలటు ఎన్నికపద్ధతిమూలమున ఉపాధ్యక్షు డెన్నుకొనబడవలెను.

కేంద్రరాష్ట్రీయ శాసనసభలలో వేనియందును ఉపాధ్యక్షుడు సభ్యుడుగ నుండరాదు. ఒకానొకప్పుడే శాసన సభ్యుడైనను ఉపాధ్యక్షుడుగ నెన్నుకొనబడినచో ఆస్థానము ఉపాధ్యక్షుడు పదవి స్వీకరించుటతోడనే ఖాళీయగును. ఉపాధ్యక్ష పదవి కెన్నుకొనబడు వ్యక్తి క్రిందియోగ్యతలు కలియుండవలెను. ఆవ్యక్తి,

(i) భారతదేశ పౌరుడై యుండవలెను.

(ii) ముప్పది మైదేండ్ల వయసుగల్గియుండవలెను.

(iii) స్టేట్సుకౌన్సిలు సభ్యుడుగ నెన్నుకొనబడుట కర్హతగలి యుండవలెను.

జీతము తీసికొను ప్రభుత్వోద్యోగి ఉపాధ్యక్ష పదవి కెన్నుకొనబడుట కర్హుడుగాడు. కాని గవర్నరు, రాజప్రముఖ ఉపరాజప్రముఖులు, మంత్రులు వీరికి ఈనిషేధము వర్తింపదు.

67 ఉపాధ్యక్షుడు పదవి స్వీకరించినప్పటినుండియు అయిదేండ్లు ఆపదవి యందుండవలెను.

స్వదస్తూరీతో వ్రాయబడిన లేఖను ప్రెసిడెంటుకుపంపి వైస్‌ప్రెసిడెంటు తనపదవికి రాజీనామా నీయవచ్చును

స్టేట్సుకౌన్సిలు సభ్యులందరును ఏకగ్రీవముగా తీర్మానించి, ఆతీర్మానమును ప్రజాసభ (హౌస్ ఆఫ్ పీపిల్) కూడ అంగీకరించినచో వైస్‌ప్రెసిడెంటు పదవినుండి తొలగింపబడును.

క్రొత్త వైస్‌ప్రెసిడెంటు పదవి స్వీకరించువరకును అయిదేండ్ల పరిమితి ముగిసినను ప్రాతవైస్‌ప్రెసిడెంటు పదవియందు ఉండును.

68 వైస్‌ప్రెసిడెంటు పదవి కాలపరిమితి అయిదేండ్లు ముగియక మునుపే క్రొత్త వైస్‌ప్రెసిడెంటు ఎన్నిక జరుగవలెను.

మరణము, రాజీనామా, తొలగింపు మున్నగు కారణములచే వైస్‌ప్రెసిడెంటు పదవి ఖాళీయైనచో తిరిగి సాధ్యమైనంత త్వరలో క్రొత్త వైస్‌ప్రెసిడెంటు ఎన్నుకొనబడవలెను; అట్లెన్నుకొనబడిన వ్యక్తి అయిదేండ్లకాలము పదవియందుండును.

69 ఉపాధ్యక్షుడుగ నెన్నుకొనబడిన వ్యక్తి పదవి స్వీకరించుటకుముందు దిగువ నుదహరించిన రీతిని అధ్యక్షుని యెదుట

గాని, అధ్యక్షుని తరుపున మరియొకరి యెదుటగాని దిగువ చెప్పినరీతిని ప్రమాణము చేయవలెను.

నేను రాజ్యాంగప్రణాళిక సూత్రములకు విధేయుడనై స్వీకరింపబోవు పదవికి చెందిన విధులు సక్రమముగా నిర్వర్తించెదనని దేవునియెదుట ప్రమాణము చేయుచున్నాను.

70 అవాంతర పరిస్థితులలో అధ్యక్షపదవి విధులు నిర్వహించుట కవసరమగు విధానమును పార్లమెంటు నిర్ణయింపవచ్చును.

71 అధ్యక్ష, ఉపాధ్యక్షుల ఎన్నికల విషయమున తటస్థించు వివాదములును, సంశయములును పరిష్కరించుటకు సుప్రీంకోర్టునకే అధికారము గలదు.

72 సైనిక న్యాయస్థానము (కోర్టుమార్షల్) విధించిన శిక్షలు, మరణదండన మున్నగు కొన్నిశిక్షలు రద్దుచేయుటకును, తగ్గించుటకును, క్షమించుటకును అధ్యక్షుని కధికారము గలదు.

73 ఏయే విషయములలో శాసనము చేయుటకు పార్లమెంటున కధికారము గలదో ఆవిషయములన్నిటిలో కార్యనిర్వహణాధికారము యూనియను ప్రభుత్వమునకు గలదు.

74 అధ్యక్షుడు తన విధులు నిర్వర్తించుటలో యుక్తమగు సలహాల నిచ్చుటకై ప్రధానమంత్రి ఆధిపత్యముతో గూడిన మంత్రివర్గ మొకటి యుండును.

అధ్యక్షునకు మంత్రులొసగిన సలహా యెట్టిదో విచారించుటకే న్యాయస్థానమునకును అధికారము లేదు.

75 ప్రధానమంత్రివర్గమందలి యితర మంత్రులు ప్రధానమంత్రిచే నియమింపబడవలెను.

అధ్యక్షుని కిష్టమగునంతకాలము మంత్రులు పదవియందుండవచ్చును.

మంత్రివర్గము ప్రజాసభకు సమిష్టి బాధ్యత వహింపవలెను.

పదవిని స్వీకరించుటకుముందు ఒక్కొక్క మంత్రియు అధ్యక్షుని యెదుట ఉద్యోగ రహస్య ప్రమాణము స్వీకరింపవలెను.

పార్లమెంటులో వరుసగా ఆరునెలలకాలము సభ్యత్వము లేని మంత్రిపదవిని గోల్పోవును.

మంత్రుల జీతములును, అల్లవెన్సులును పార్లమెంటు నిర్ణయముపై నాధారపడియుండును; అట్లుపార్లమెంటు నిర్ణయించువరకును ఆజీతములును, అల్లవెన్సులును రెండవ షెడ్యూలులో నుదహరింపబడిన రీతిగ నుండును.

77 భారత ప్రభుత్వకార్యనిర్వాహణ మంతయు అధ్యక్షుని పేరున నేజరుగవలెను.

అధ్యక్షునిచే శాసనరీత్యా చేయబడిన ఉత్తరువులు సక్రమమా కాదా? అని ప్రశ్నించుటకు వీలులేదు.

భారతప్రభుత్వ కార్యనిర్వహణమునకును, మంత్రుల పరిపాలనాశాఖల వినిమయమునకును (పంపిణీకిని) అవసరమగు నియమను లధ్యక్షుడు చేయువలెను.

78 యూనియను పరిపాలనా వ్యవహారముల విషయమున మంత్రివర్గము గావించిన నిర్ణయములను, శాసనములు చేయుటకు సలహాలను, ఈవిషయములకు సంబంధించి అధ్యక్షునకు తెలియపరచుట ప్రధానమంత్రి విధియైయున్నది.

ఒక మంత్రి తన పరిపాలనాశాఖకు సంబంధించిన విషయముపైనొక నిర్ణయము చేసినమీదట ఆవిషయము మంత్రివర్గమువారందరును కలసి తిరిగి చర్చింపవలెనని అధ్యక్షుడు కోరినచో ప్రధానమంత్రి ఆవిషయమును మంత్రివర్గము నెదుట చర్చకు పెట్టవలెను.

రెండవ అధ్యాయము:- పార్లమెంటు.

79 యూనియన్నకు (భారతసమాఖ్యకు) ఒక పార్లమెంటు ఉండవలెను. అధ్యక్షుడును, స్టేట్సుకౌన్సిల్ను ప్రజాసభ (హౌస్ ఆప్ ది పీపుల్) యును కలసి పార్లమెంటు అనబడును.

80 స్టేట్సుకౌన్సిలు దిగువరీతిని ఏర్పడవలెను.

(i) సాహిత్యము, విజ్ఞానము, కళ, సంఘసేవ వీనియందు ప్రవీణులును అనుభవజ్ఞులునగు పన్నెండుగురు సభ్యులను అధ్యక్షుడు నియోగింపవలెను.

(ii) రెండువందల ముప్పది యెనమండ్రుగురు సభ్యులు నాలుగవ షెడ్యూలు నిబంధనల ననుసరించి రాష్ట్రముల ప్రతినిధులుగ నుండవలెను.

(iii) మొదటి షెడ్యూలులోని A, B భాగములందు నిర్దేశింపబడిన రాష్ట్రముల ప్రతినిధులు ఆయారాష్ట్రముల లెజస్లేటివ్ ఎసంబ్లీలోని ప్రజాప్రతినిధులచే ప్రపోర్షనల్ రెప్రజెంటేషను విధానము ననుసరించి సింగిల్ ట్రాన్స్ఫరబుల్ వోటుచే ఎన్నుకొనబడవలెను.

(iv) మొదటి షెడ్యూలులో సి భాగమున నిర్దేశింపబడిన రాష్ట్రముల ప్రతినిధులు పార్లమెంటు నిర్ణయించిన రీతిని ఎన్నుకొనబడవలెను.

81 ప్రజాసభయందలి సభ్యులు సాధారణముగ అయిదువందల మంది యుండవలెను. ఈ సభ్యులు రాష్ట్రములందలి వోటరులచే ప్రత్యక్షముగనే ఎన్నుకొనబడుదురు.

ప్రజాసభయందలి సభ్యుల యెన్నికకొరకు రాష్ట్రములను వేర్వేరు నియోజకవర్గములుగ విభజింపవలెను. 750000 మంది జనుల కొక్కొక ప్రతినిధికి తక్కువ లేకుండునట్లును, (500000 మందికి ఒక్కొక ప్రతినిధి కంటె నెక్కువ లేకుండునట్లును) ఈ నియోజకవర్గము లేర్పడవలెను. ఒక్కొక సారి క్రొత్తగ జనాభాలెక్కలు తయారగుచున్న కొల

దియు ప్రతినిధుల. లెక్కలను పార్లమెంటు శాసనము ద్వారా సరిపెట్టుచుండవలెను.

82 అవసరమునుబట్టి మొదటిషెడ్యూలులోని సి భాగమున నిర్దేశింపబడిన రాష్ట్రముల ప్రతినిధుల నిర్ణయించుటలో పార్లమెంటు శాసనము చేయవచ్చును.

83 (i) ప్రతి రెండేండ్లకును ఒక్కొకసారి స్టేట్సుకౌన్సిల్ సభ్యులలో మూడవ వంతు మంది సభ్యులస్థానములు ఖాళీఅగుచుండి ఆమూడవ వంతు స్థానములకే ఎన్నికలు జరగుచుండును. కనుక స్టేట్స్‌కౌన్సిల్ ఎప్పుడును రద్దు కానేరదు.

(ii) ప్రజాసభ మొదటి సమావేశమునుండి అయిదేండ్ల కాలము అమలు నందుండును. ఒక్కొకపుడు ప్రజాసభ అయిదేండ్లకు ముందుగనే రద్దుచేయబడవచ్చును. అసాధారణ పరిస్థితులలో ప్రజాసభ కాలపరిమితి ఒక్కొక సంవత్సరముచొప్పున పార్లమెంటు శాసనము చేసి పొడిగించవచ్చును.

84 పార్లమెంటు సభ్యత్వమునకు దిగువ పేర్కొనబడిన అర్హత లుండవలెను.

(i) భారతదేశపౌరసత్వము గల్గియుండవలెను.

(ii) సేట్సుకౌన్సిలు సభ్యత్వమునకు ముప్పదియేండ్లవయస్సును, ప్రజాసభసభ్యత్వమున కిరువదియైదేండ్లు నుండవలెను.

(iii) పార్లమెంటు నిర్ణయించిన ఇతర యోగ్యతలుండవలెను.

85 సంవత్సరమున కధమము రెండుసార్లయినను పార్లమెంటు సభలు సమావేశము జరుగవలెను. ఒక సమావేశమునకును మరియొక సమావేశమునకును మధ్య ఆరునెలలకాలము వ్యవధియుండరాదు.

పార్లమెంటు సభలను అధ్యక్షుడు తనకు యుక్తమని తోచిన స్థలమునను సమయమునను సమావేశపరుపవచ్చును. ఆసమావేశములకు వాయిదావేయవచ్చును. ప్రజాసభను రద్దు పరుపవచ్చును.

86 అవసరమని తోచినపుడు పార్లమెంటు సభ్యులను సమావేశపరచి ఒకేసభలో గాని రెండుసభల సంయుక్త సమావేశమునగాని ప్రసంగింపవచ్చును.

పార్లమెంటు సభలకు అధ్యక్షుడు సందేశముపంపి ప బిల్లునుగూర్చియైనను శీఘ్రముగ చర్చింపవలెనని కోర వచ్చును. అట్టి సందేశమందిన వెంటనే సాధ్యమైనంత త్వరలో అందుకు సబంధించిన చర్చ జరుగవలెను.

87 పార్లమెంటు సమావేశముల ఆరంభమున నధ్యక్షుడు సంయుక్తసభలో ప్రసంగించి పార్లమెంటు సమావేశ కారణములు వివరింపవలెను.

అధ్యక్షుడుచేసిన ప్రసంగమునందలి ముఖ్యవిషయములు చర్చించుటకు సభ్యులకు వెంటనే అవకాశముండవలెను.

88 ప్రధానమంత్రికిని, అటార్నీజనరలునకును రెండు పార్లమెంటుసభలందును చర్చలలో పాల్గొన వచ్చును గాని తనకు సభ్యత్వములేని సభలో వోటుచేయుట కధికారముండదు.

89 భారతదేశపు ఉపాధ్యక్షుడు స్టేట్సుకౌన్సిలు సమావేశములకు పీఠపతి (చెయిర్మను) గా నుండవలెను.

స్టేట్సుకౌన్సిలు సభ్యులు తమలో నొకనిని ఉపపీఠపతి డెప్యూటీ చెయిర్మనుగ నెన్నుకొనవలెను. ఈపదవి ఖాళీ అయినపుడెల్ల క్రొత్త ఉపపీఠపతి యెన్నుకొనబడవలెను.

90 స్టేట్సుకౌన్సిలు సభ్యత్వము గోల్పోయినవెంటనే ఉపపీఠపతి తన పదవినిగూడ గోల్పోవును. అవసరమని తోచినచో ఉపపీఠపతి స్వదస్తూరితో వ్రాయబడిన లేఖను పీఠపతికి పంపి తన పదవికి రాజీనామా నీయవచ్చును. స్టేట్సుకౌన్సిలు సభ్యులలో నధిక సంఖ్యాకులు తీర్మానముచేసి ఉపపీఠపతిని పదవినుండి తొలగింపవచ్చును.

91 పీఠపతి హాజరు కానపుడు ఉపపీఠపతి స్టేట్సుకౌన్సిలు సమావేశమున కధ్యక్షత వహింపవలెను. ఉపపీఠపీఠియు హాజరు కానిచో కౌన్సిలుచే నిర్ణయింపబడిన మరియొక సభ్యుడా కార్యక్రమము నిర్వహింపవలెను. ఉపాధ్యక్షుడు అధ్యక్షుని విధుల నెరవేర్చుచున్నపుడు ఉపపీఠపతి ఉపాధ్యక్షుని విధులు నిర్వర్తింపవలెను.

92 ఉపాధ్యక్షునిగూర్చి తొలగింపు తీర్మానము చర్చింపబడు చున్న సమయమున నతడు సమావేశమున కధ్యక్షత వహింపరాదు. అట్లే ఉపపీఠపతినిగూర్చి తొలగింపు తీర్మానము చర్చలోనున్నపు డతడధ్యక్షత వహింపరాదు.

93 ప్రజా సభా సభ్యులలో నొక వ్యక్తి సభాపతిగను మరియొక వ్యక్తి ఉపసభాపతిగను ఎన్నుకొనబడవలెను. ఆపదవులు ఖాళీ అయినపుడెల్ల తిరిగి ఆపదవులకు ఎన్నికలు జరుగవలెను.

94 ఒకవ్యక్తికి ప్రజాసభ సభ్యత్వముతోబాటు సభాపతిపదవియు, ఉపసభాపతిపదవియు బోవును. ఆదపవులలోనున్న వ్యక్తులు స్వదస్తూరీతో లేఖవ్రాసి రాజీనామా చేయవచ్చును. సభాపతి రాజీనామా చేయదలచిన ఉపసభాపతికి లేఖ వ్రాయవలెను. ఉపసభాపతియైన సబాపతికి వ్రాయవలెను. ప్రజాసభలోని అధిక సంఖ్యాకులగు సభ్యుల తీర్మానముచే సబాపతినిగాని ఉపసభాపతినిగాని తొలగింపవచ్చును. ప్రజాసభ రద్దయినప్పటికిని సభాతిపపదవిని క్రొత్తగ నెన్నుకొనబడిన ప్రజాసభ మొదటి సమావేశము వరకు నుండును.

95 సభాపతిపదవి ఖాళీయైనపుడుగాని, సభాపతి సమావేశమునకు హాజరు కానపుడుగాని ఉపసభాపతి సభాపతి విధుల నిర్వర్తింపవలెను. ఉపసభాపతికూడ హాజరుకానిచో

ప్రజాసభచే నెన్నుకొనబడిన ఒకసభ్యుడావిధుల నెర వేర్చును.

96 సభాపతినిగూర్చి తొలగింపు తీర్మానము చర్చింపబడు చున్న సమావేశమున కతడధ్యక్షత వహింపరాదు. అట్లే ఉపసభాపతిపై తొలగింపు తీర్మానమున్నపుడతడు అధ్యక్షత వహింపరాదు.

సభాపతిపై తొలగింపు తీర్మానముచర్చ జరగుచున్నపు డతడు సమావేశ కార్యక్రమములో పాల్గొని వోటు నీయవచ్చును. కాని ఆ తీర్మానమున కనుకూలురును, వ్యతిరేకులును సమానులుగ నున్నపుడతడు తన వోటు నీయరాదు.

97 సభాపతి, ఉపసభాపతి, పీఠపతి, ఉపపీఠపతి, వీరి జీతము లును, అల్లవెన్సులును పార్లమెంటు శాసనముచే నిర్ణయింప బడవలెను. అట్టి నిర్ణయము జరగువరకును రెండవ షెడ్యూలులో నుదహరింపబడినరీతిగ నివి యీయబడును.

98 పార్లమెంటుసభలో నొక్కొక్క సభకును వేర్వేరు ఉద్యోగబృందముండవలెను. ఒక్కొకపు డవసరమునుబట్టి ఉమ్మడి ఉద్యోగులు నుండవచ్చును. ఈఉద్యోగుల నియా మకపు విధులు పార్లమెంటుశాసనముచే నిర్ణయింపబడ వలెను. అట్టి నిర్ణయము జరుగువరకు సభాపతి పీఠపతుల సలహాతో అధ్యక్షుడందుల కవసరమగు నిబంధనలు చేయవలెను.

99 పార్లమెంటు సభ్యులు తమ పదవి స్వీకరించుటకు పూర్వము అధ్యక్షుని సమక్షమునగాని ఆయన తరపున మరియొకరి సమక్షమునగాని మూడవ షెడ్యూలులో నుదహరింపబడిన రీతిని ప్రమాణము చేయవలెను.

100 పార్లమెంటు సభలలోని ప్రతిపాదనలన్నియు సభ్యులలో అధికసంఖ్యాకుల వోటునుబట్టి నెగ్గుటయు, ఓడుటయు పరిష్కరింపబడును; అధ్యక్ష స్థానమునన్న వ్యక్తికి సాధారణముగా వోటుచేయు హక్కుండదు. కాని ఏ ప్రతిపాదనకైనను అనుకూలురును, వ్యతిరేకులును సమానసంఖ్యగ నున్నపుడు అధ్యక్ష స్థానమందున్న వ్యక్తి తనవోటు నొసగవలెను.

సభ్యులలో కొన్నిపదవులు ఖాళీగానున్నను సమావేశములు సక్రమముగనే నడచిపోవలెను.

ఒక సమావేశమునకు కోరం (హాజరు కావలసిన సభ్యుల కనీసపు సంఖ్య) ఆసభ మొత్తము సభ్యుల సంఖ్యలో పదియవ వంతుగ నుండవలెను.

ఒక సమావేశములో నొకానొక సమయమున కోరం లేనిచో అధ్యక్షస్థానమందున్న వ్యక్తి సమావేశమును వాయిదా వేయవలెను, లేక కోరం సమకూడువరకు సమావేశము నిల్పియుంచవలెను.

101 (i) ఏ వ్యక్తియు పార్లమెంటు సభలు రెండింటిలోను ఏక కాలమున సభ్యత్వము వహింపరాదు; రెండింటికిని ఎన్నుకొనబడినను ఒక సభయందు సభ్యత్వమునకు రాజీనామా చేయవలెను.

(ii) ఏవ్యక్తియును ఏకాలమున పార్లమెంటుసభలోను రాష్ట్రీయశాసన సభలోను సభ్యత్వము వహింపరాదు. రెండింటికిని ఎన్నుకొనబడినను అందుకు నిర్ణయింపబడిన తేదీలోగా రాష్ట్రశాసనసభకు రాజీనామా చేయనిచో పార్లమెంటు సభ్యత్వము గోల్పోవను.

(iii) పార్లమెంటు అనుమతిలేనిదే పార్లమెంటు సమావేశములకు అరువదిరోజులు హాజరుకానిసభ్యుడు తన సభ్యత్వమును గోల్పోవును.

102 దిగువ పేర్కొనబడినవారు పార్లమెంటు సభ్యత్వమునకనర్హులుగ పరిగణింపబడుదురు.

(i) కేంద్రరాష్ట్ర ప్రభుత్వములందు దేనిలోనైనను జీతము తీసికొనిఉద్యోగముచేయువారు (కేంద్రరాష్ట్రమంత్రులకిది వర్తింపదు.)

(ii) మతిస్థిమితములేదని కోర్టుచే నిర్ణయింపబడినవారు.

(iii) దివాలా తీసినవారు.

(iv) భారతదేశ పౌరత్వములేనివారు. విదేశములందు పౌరత్వముగలవారు.

103 పార్లమెంటు సభ్యత్వమునుగూర్చి గల్గు తగాదాలను అధ్యక్షుడు ఎలెక్షన్ కమిషన్ అభిప్రాయము ఆవిషయమున తెలిసికొని ఆ అభిప్రాయానుసారముగ పరిష్కరించును.

104 తగిన యోగ్యత లేకుండ పార్లమెంటుసభల సమావేశములలో ఏవ్యక్తియైనను పాల్గొనుటగాని వోటుచేయుటగాని బుద్ధిపూర్వకముగ జరపినచో అట్లు చేసిన ఒక్కొక్కరోజునకును అతడు యూనియనుకు అయిదు వందలురూపాయలు అపరాధముక్రింద చెల్లింపవలెను.

105 పార్లమెంటు సభ్యులకు వాక్స్వాతంత్ర్యముండవలెను. పార్లమెంటులో నిచ్చిన ఉపన్యాసమునుగాని వోటునుగాని ఆధారముగ జేసికొని ఏ సభ్యునిపైనను న్యాయస్థానమున చర్యజరుపరాదు.

పార్లమెంటుసభ్యుల అధికారములు, ప్రత్యేక మర్యాదలు మినహాయింపులు మున్నగునవి అప్పటప్పట పార్లమెంటు నిర్ణయించుచుండవలెను.; అట్లు నిర్ణయించువరకును బ్రిటిషు పార్లమెంటు సభ్యుల ననుసరించి అవి యుండును.

106 పార్లమెంటు సభ్యుల జీతములును అలవెన్సులును శాసనము మూలమున పార్లమెంటు అప్పటప్పట నిర్ణయించుచుండవలెను.

107 (i) సాధారణముగ ఒక బిల్లు పార్లమెంటు సభల రెండింటి లోను దేనియందైనను ప్రతిపాదింపబడవచ్చును.

(ii) రెండు సభలలోను అధికసంఖ్యాకుల అంగీకారముపొందిననే తప్ప ఏ బిల్లును తీర్మానమైనట్లు పరిగణింప బడదు.

(iii) పార్లమెంటు సభలో నేదైనను వాయిదాపడిన కారణముచేతను రద్దయిన మాత్రముననే ఏ బిల్లును కాలదోషమును పొందదు.

108 ఒకసభలో నొకబిల్లు తీర్మానింపబడి రెండవ సభలో నిరాకరింపబడినచో అధ్యక్షుడు రెండు సభల సంయుక్త సమావేశము జరపవలెను. రెండుసభలలోని మొత్తము సభ్యులలో అధికసంఖ్యాకుల అంగీకారము పొందిన బిల్లు తీర్మానమైనట్లెంచబడవలెను. ధనసంబంధమగు బిల్లుల కీనియమము వర్తింపదు.

109 ధనసంబంధమగు బిల్లులు స్టేట్సుకౌన్సిలులో ప్రతిపాదింపబడరాదు.

ప్రజాసభలో తీర్మానింపబడిన ధనసంబంధమగు బిల్లు స్టేట్సుకౌన్సిలులో ప్రవేశపెట్టబడవలెను. పిమ్మట పదునాలుగు రోజులలోగా స్టేట్సుకౌన్సిలు సభ అవసరమగు సవరణలతో ప్రజాసభకు పంపవలెను. ఆ సవరణలను ప్రజాసభ అంగీకరించిగాని అంగీకరింపకుండగాని ఆ బిల్లును

చర్చించి అధిక సంఖ్యాకుల అభిప్రాయానుసారము తీర్మా నింపవలెను.

110 దిగువ పేర్కొనబడిన అంశములతో గూడినబిల్లు ధన సంబంధమగు బిల్లు అనబడును.

(i) పన్నుల విధింపు, తగ్గింపు, తొలగింపు.

(ii) ఋణము చేయుట; ఇతర ఆర్థిక నిర్ణయములు

(iii) కంసాలిడేటెడ్ ఫండు, కంటింజెన్సీ ఫండులలో ధనము నిలువచేయుట, వానినుండి వెచ్చించుట, ఆఫండును వృద్ధిచేయుట.

ఏ విధమైన సంబంధమగు బిల్లులో ప్రజాసభయొక్క సభాపతి నిర్ణయింపవలెను.

111 పార్లమెంటు సభలలో నొకబిల్లు తీర్మానమైన పిదప అది అధ్యక్షుని సమక్షమున దాఖలు చేయబడవలెను; అధ్యక్షుడు ఆతీర్మానమునకు తన అంగీకారము తెలుపవచ్చును లేదా తన యంగీకారమును వెనుకకు బెట్టవచ్చును.

ఒకబిల్లు తన యెదుట దాఖలు చేయబడిన వెంటనే అది ధనసంబంధమగు బిల్లుకాని పక్షమున ఆబిల్లునకవసరమని తోచిన సవరణలు సూచించి ఆబిల్లును తిరిగి చర్చింపవలసినదని పార్లమెంటు సభలకు పంపవచ్చును. ఆసవరణ లామోదించిన

విదపగాని, ఆమోదించకగాని, పార్లమెంటు సభలు తిరిగి తీర్మానముచేసి అధ్యక్షునకు దాఖలు చేయబడినపు డాయన తన యంగీకారమును వెనుకకు పెట్టరాదు.

112 ఒక్కొక్క ఆర్థిక సంవత్సరము ముగియగనే ఇండియా ప్రభుత్వపు సాంవత్సరిక ఆదాయవ్యయముల అంచనాలు పార్లమెంటు ఎదుట నుంచునట్లు అధ్యక్షుడు ప్రభుత్వముచే చేయింపవలెను.

ఈ సాంవత్సరిక ఆర్థికపట్టికలో రివిన్యూ లెక్కల ఖర్చులు వేరుగను, కన్‌సాలిడేటెడ్ ఫండు ఖర్చులు వేరుగను సూచింపవలెను. సభాపతి, ఉపసభాపతి, పీఠపతి, ఉపపీఠపతి, సుప్రీం కోర్టు న్యాయాధిపతుల జీతముల అల్లవెన్సులు, కంప్ట్రోలర్ ఆడిటర్ జనరల్ జీతము అల్లవెన్సులు ఇవి యన్నియు కన్సాలిడేటెడ్ ఫండులో నుండి ఖర్చుకావలసిన పద్దులు.

113 కన్సాలిడేటెడ్ ఫండులోనుండి యగు ఖర్చులపద్దులను గూర్చి పార్లమెంటు సభ్యులు చర్చింపవచ్చును. గాని వాటిపై వోటు చేయరాదు.

మిగిలిన పద్దులు పార్లమెంటు సభ్యులు చర్చించి అంగీకరింపవచ్చును, తగ్గింపవచ్చును, లేదా నిరాకరింపవచ్చును. అధ్యక్షుని అనుమతి పొందినమీదటనే ఒక్కొక పద్దును పార్లమెంటు నెదుట చర్చకు పెట్టవలెను.

114 పైనచెప్పిన విధముగ పద్దులు ప్రజాసభలో మంజూరైన పిదప కన్సాలిడేటెడ్ ఫండునుండి ఖర్చు కావలసిన మొత్తములకు ఒక బిల్లు ప్రతిపాదింపబడవలెను. ఈబిల్లునకు పార్లమెంటు సభలలో సవరణలు ప్రవేశపెట్టబడరాదు. ఆపద్దుల మొత్తములు మార్చరాదు.

115 పైనిబంధనల ననుసరించి మంజూరుచేయుబడిన అంచనా మొత్తములు ఆ సంవత్సరమునకు అవసరమగు ప్రభుత్వపుఖర్చులుకు చాలకపోయినను, అంచెనాల కంటె ఎక్కువ మొత్తము ఖర్చైన పక్షమునను అదనపు ఖర్చులపట్టికను ప్రజాసభయెదుట ప్రభుత్వముచే అధ్యక్షుడు దాఖలు చేయించవలెను.

116 పైనిబంధనలతో నిమిత్తములేకుండనే ఆయా అవసర పరిస్థితులనుబట్టి ఎక్కువ ఖర్చుమొత్తములను ముందుగనే గాని ఖర్చయినపిదపగాని మంజూరుచేయుటకును కన్సాలిడేటెడుఫండునుండి అవసరమగు మొత్తములు తీసికొనుటకు ప్రభుత్వమున కధికారము గల్గించుటకును పార్లమెంటున కధికారముండును.

117 పై 110 వ నిబంధన ననుసరించి ప్రతిపాదింపబడు బిల్లు అధ్యక్షుని అనుమతిని తప్పక బడయవలయును. అట్టి బిల్లు స్టేట్సు కౌన్సిలులో ప్రతిపాదింపబడరాదు.

కన్సాలిడేటెడ్ ఫండునుండి ఖర్చునకు కారణభూతమగు బిల్లు అధ్యక్షుని అనుమతిని బడయవలయును.

118 సభాకార్యక్రమము జరగుటకవసరమగు నియమము లను ఒక్కొక్క పార్లమెంటు సభయు సౌకర్యమునుబట్టి దేనికదియే నిర్ణయించుకొనవలెను.

అట్టి నియమములు జరగువరకును ఈ రాజ్యాంగప్రణాళిక అమలులోనికి వచ్చునాటికి ఉన్న క్రమమనుసరింపబడవలెను.

సంయుక్తసమావేశముల కవసరమగు నియమములు ప్రజాసభ సభాపతితోను, స్టేట్సుకౌన్సిలు పీఠపతితోను ఆలోచించి అధ్యక్షుడు నిర్ణయింపవలెను.

సంయుక్తసమావేశములకు ప్రజాసభ సభాపతిగాని ఆయన హాజరుకాని సమయమున నియమముల ననుసరించి మరియొకరుగాని అధ్యక్షత వహింపవలెను.

119 కన్సాలిడేటెడ్ ఫండునుండి ఖర్చుచేయుటకుగాని ఇతర ఆర్థికవ్యవహారములకుగాని సంబంధించిన కార్యక్రమముగాని శీఘ్రముగా జరగుట కవసరమగు నియమములు శాసనముల మూలమున పార్లమెంటు చేయవచ్చును.

120 సాధారణముగ పార్లమెంటు కార్యక్రమము హిందీభాషలోగాని ఇంగ్లీషు భాషలోగాని జరుగవలెను.

హిందీలోగాని ఆంగ్లభాషలోగాని సరిగా అభిప్రాయములు ప్రకటింపలేని సభ్యునకు మాతృభాషలో మాటలాడుటకు సభాధ్యక్షు డనుమతి నీయవచ్చును.

పార్లమెంటు ఈలోపున మఱియొక విధముగ శాసించిన తప్ప ఈరాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి వచ్చిన పదునైదేండ్ల పిదప ఆంగ్లభాష అను పదమీ నిబంధననుండి తొలగింపవలెను.

## నాల్గవ అధ్యాయము యూనియనున్యాయశాఖ

121 సుప్రీంకోర్టుజడ్జి చర్యలను గూర్చి హైకోర్టుజడ్జి చర్యలను గూర్చిగాని పార్లమెంటులో చర్చ జరుగరాదు; కానిజడ్జిని పదవినుండి తొలగించు సందర్భములో అధ్యక్షునికా విషయమున నొక విజ్ఞప్తి సమర్పింపబడవలెను.

122 క్రమవిధానము ననుసరించి నడువలేదను కారణముచే పార్లమెంటు కార్యక్రమమును ఆక్షేపించుటకు వీలులేదు,

పార్లమెంటు కార్యక్రమము నడపించుటకు నియమింపబడిన ఏ ఉద్యోగి చర్యలను న్యాయస్థానములో నాక్షేపణార్హములుగావు.

123 పార్లమెంటు సభాసమావేశములు జరుగుచున్న సమయమున తప్ప ఇతర సమయములందేనైనను విషమ పరిస్థితులేర్పడి సత్వరచర్య అవసరమని తోచినచో అధ్యక్షుడు అసాధారణ శాసనములు (ఆర్డినెన్సులు) అమలు జరుపవచ్చును.

పార్లమెంటు శాసనముల అధికారమే అసాధారణ శాసనములకు నుండును; పార్లమెంటు సమావేశమారంభమైన ఆరు వారములకు అసాధారణ శాసనములు రద్దగును పార్లమెంటు తీర్మానముల మూలమున అసాధారణ శాసనములను రద్దు చేయవచ్చును; లేక అధ్యక్షునిచే అసాధారణ శాసనము లుపసంహరింపబడ వచ్చును.

124 (i) ఒక ప్రధాన న్యాయమూర్తియు, ఏడుగురు న్యాయమూర్తులునుగల సుప్రీంకోర్టు భారతదేశమున నుండవలెను.

(ii) సుప్రీంకోర్టు న్యాయమూర్తులందరును అధ్యక్షునిచే నియమింపబడవలెను. ఇట్లు నియమించుటలో అధ్యక్షుడు వీలునుబట్టి ఇతర న్యాయమూర్తుల సలహాను తీసికొనవచ్చును. సాధారణ న్యాయమూర్తుల నియమించుటలో భారతప్రధాన న్యాయమూర్తి సలహాను అధ్యక్షుడు తీసికొనవలసియుండును.

(iii) న్యాయమూర్తులు అరువదియైదేండ్లువయసు వచ్చువరకును ఉద్యోగమున నుండవలెను.

(iv) న్యాయమూర్తులకు క్రిందియోగ్యతలుండవలెను.

భారతదేశ పౌరత్వము, హైకోర్టులో అధమము ఐదేండ్లు న్యాయమూర్తి పదవియందనుభవము, అధ్యక్షుని యభిప్రాయము ననుసరించి న్యాయశాస్త్ర ప్రవీణుడను ఖ్యాతి.

(v) న్యాయమూర్తి ఉద్యోగకాలము ముగియకముందు స్వదస్తూరీతో అధ్యక్షునకు లేఖవ్రాసి రాజీనామా నీయవచ్చును. ఒక న్యాయమూర్తియొక్క అసమర్థతయు, అక్రమప్రవర్తనయు ఋజువుపరచి పార్లమెంటు సభ్యులు మూడింట రెండువంతులు వోట్లతో ఒక తీర్మానముచేసి అధ్యక్షునకు విజ్ఞప్తి సమర్పించిన పక్షమున ఆ న్యాయమూర్తిపదవినుండి తొలగింపబడును.

(vi) న్యాయమూర్తిపదవి స్వీకరించుటకు ముందు అధ్యక్షుని సమక్షమునగాని ఆయన పక్షమున మరియొకరి సమక్షమునగాని ప్రమాణము స్వీకరింపవలెను.

(vii) సుప్రీంకోర్టు న్యాయమూర్తిపదవినుండి విరమించిన పిదప ఎవరును భారతదేశమందు మరియే న్యాయస్థానమునను న్యాయవాదిగ పనిచేయరాదు.

125 సుప్రీంకోర్టు న్యాయమూర్తుల జీతములు రెండవ షెడ్యూలున నుదహరింపబడిన రీతిగ నుండవలెను.

పార్లమెంటు శాసనము ననుసరించి న్యాయమూర్తుల ప్రత్యేక సౌకర్యములును అల్లవెన్సులును, సెలవు పింఛను హక్కులు నుండును.

126 ప్రధాన న్యాయమూర్తి పదవి ఖాళీగ నున్నపుడుగాని, కారణాంతరములచే ప్రధాన న్యాయమూర్తి తన

విధులు నెరవేర్పుజాలనపుడుగాని, ఆపనవికి సంబంధించిన విధులు నిర్వర్తించుటకు మరియొక న్యాయమూర్తిని అధ్యక్షుడు నియమింపవలెను.

127 కారణాంతరములచే ఏసమయముననైనను సుప్రీంకోర్టు న్యాయమూర్తులసంఖ్య న్యాయవిచారణకు తగినంతగా లేనిచో భారతప్రధానమూర్తి అధ్యక్షుని అనుమతి ననుసరించి ఏకోర్టు న్యాయమూర్తినైనను అచటి ప్రధాన న్యాయమూర్తి సలహాను గైకొని సుప్రీంకోర్టు న్యాయమూర్తిగ తాత్కాలికముగ నియమింపవచ్చును. ఇట్లు నియమింపబడిన న్యాయమూర్తి సుప్రీంకోర్టులో వెంటనే పనిచేయుట అతని విధిగ భావింపవలెను. స్థిరముగా నియమింపబడిన సుప్రీంకోర్టు న్యాయమూర్తికి నుండు అధికారములన్నియు తాత్కాలిక న్యాయమూర్తికిని ఉండును.

128 ఒక్కొకపుడు అధ్యక్షుని అనుమతితో ప్రధానన్యాయమూర్తి అదివరలో సుప్రీంకోర్టులోగాని ఫెడరల్ కోర్టులోగాని పనిచేసిన న్యాయమూర్తి నెవరినైనను సుప్రీంకోర్టున్యాయమూర్తి పనిచేయవలసినదని కోరవచ్చును.

129 సుప్రీంకోర్టు పత్రములను దాఖలు చేసికొను న్యాయస్థానముగ నుండును; ఆన్యాయస్థానపు ధిక్కారమునకు శిక్షించు అధికారము సుప్రీంకోర్టునకే యుండును.

130 సుప్రీంకోర్టు కార్యక్రమము ఢిల్లీలోను, అధ్యక్షుని అనుమతితో భారతన్యాయమూర్తి నిర్ణయించు ఇతర స్థలములలోను జరుగవలెను.

131 క్రింద పేర్కొనబడిన కక్షిదారులమధ్య కలుగు తగాయిదాల ఒరిజినల్ జూరిస్‌డిక్షను సుప్రీంకోర్టునకే యుండును; మరియే న్యాయస్థానమునకు నుండదు.

(i) భారతప్రభుత్వమునకును మరియొక రాష్ట్రమునకును

(ii) భారతప్రభుత్వమును ఒకటిగాని యెక్కువగాని రాష్ట్రములు కలసిన పక్షమునకును; ఒకటిగాని ఎక్కువగాని రాష్ట్రములున్న పక్షమునకును

(iii) రెండుకాని ఎక్కువగాని రాష్ట్రములకును

132 ఒక హైకోర్టు ఇచ్చిన సివిలు క్రిమినలు తీర్పులపై సుప్రీంకోర్టునకు అప్పీలుచేయవచ్చును. అందులకు ఆ వివాదములో న్యాయశాస్త్రసమస్య ఇమిడియున్నదని హైకోర్టు సర్టిఫైచేయవలెను. ఆహైకోర్టు అట్టిసర్టిఫికేటు ఈయనిచో సుప్రీంకోర్టే అప్పీలునకు ప్రత్యేకానుమతి నీయవచ్చును.

133 సివిలు వ్యవహారములలో ఇరువదివేల రూపాయలవిలువగల ఆస్తికి సంబంధించిన తగాయిదాలలోనే సుప్రీంకోర్టున కప్పీలు చేయవలెను.

హైకోర్టులో ఒకే న్యాయమూర్తి యిచ్చిన తీర్పుపై సుప్రీంకోర్టున కప్పీలు చేయరాదు.

134 క్రిమినల్ కేసులలో హైకోర్టునందు విధింపబడిన ఉరి శిక్షతీర్పుపై సుప్రీంకోర్టున కప్పీలు చేయవచ్చును. పార్లమెంటు శాసనముచేసి హైకోర్టు ఇచ్చిన ఏక్రిమినల్ కేసు తీర్పుపైనైనను అప్పీలు విచారించు అధికారము సుప్రీంకోర్టున కీయవచ్చును.

135 ఈరాజ్యాంగ ప్రణాళిక అమలులోనకి వచ్చుటకు పూర్వమున్న ఫెడిరల్ కోర్టు జూరిస్ డిక్షను అంతయు సుప్రీంకోర్టుకు చెందును.

136 ఈ అధ్యాయపు నిబంధనలతో నిమిత్తము లేకుండ తన విచక్షణ నుపయోగించి భారతదేశమందలి ఏన్యాయస్థానపు తీర్పుపైనైనను అప్పీలు దాఖలుచేయుటకు ప్రత్యేకానుమతి నొసగవచ్చును.

సైనిక న్యాయస్థానపు తీర్పుల కీనియమము వర్తింపదు.

137 సుప్రీంకోర్టుచేసిన తీర్పుపై పునర్విచారణ జరపుటకా కోర్టుకు సాధారణముగ నధికారముగలదు.

138 పార్లమెంటు శాసనము వలన సుప్రీంకోర్టు జూరిస్‌డిక్షనును అధికారమును వృద్ధిచేయవచ్చును.

139 హెబియస్ కార్పస్, మాండమస్ నిషేధము, క్వోవారంటో, సర్షియోరర్రై మొదలగు ఆజ్ఞల నిచ్చుటకు సుప్రీంకోర్టునకు పార్లమెంటు శాసనమువలన అనుమతి నీయవచ్చును.

140 తనవిధులను ఎక్కువ నైపుణ్యముతో నెరవేర్చుటకవసరమగు ఇతరాధికారములను, ఈరాజ్యాంగ ప్రణాళిక సూత్రములకు భంగము లేనంతవరకు, పార్లమెంటు శాసనమువలన సుప్రీంకోర్టున కీయవచ్చును.

141 సుప్రీంకోర్టు ప్రకటించిన న్యాయశాస్త్ర సూత్రములు భారతదేశమందన్ని న్యాయస్థానములు ననుసరింపవలెను.

142 న్యాయము కల్గించుట కవసరమగు ఉత్తరువులను సుప్రీంకోర్టుచేసి వానిని పార్లమెంటు శాసనముల ననుసరించి భారతదేశమున అమలుజరపుట కధికారము గల్గియుండవలెను. భారతదేశమున ఏవ్యక్తియైనను న్యాయస్థానమున హాజరగునట్లును, అవసరమగు పత్రములు దాఖలు చేయునట్లును సుప్రీంకోర్టు ఉత్తరువు చేయవచ్చును.

143 ప్రజాక్షేమముకొరకు ఏన్యాయశాస్త్ర సంశయమైనను పరిష్కరించుట అవసరమని తోచినచో ఆసమస్యపై అభిప్రాయము తెలుపవలసినదని అధ్యక్షుడు సుప్రీం

కోర్టును కోరవచ్చును. తగిన విచారణ జరపి సుప్రీంకోర్టు తమ యభిప్రాయము నధ్యక్షునకు తెలుపవలెను.

మొదటి షెడ్యూలులోని బి భాగమునందుదహరింపబడిన రాష్ట్రములకు సంబంధించిన వివాదములను గూర్చియు అధ్యక్షుడు సుప్రీంకోర్టు అభిప్రాయము తెలిసికొనవచ్చును. అధ్యక్షుడు కోరినవెంటనే సుప్రీంకోర్టు తగిన విచారణ జరపి తన యభిప్రాయము తెలుపవలెను.

144 భారతదేశమందలి సివిల్ క్రిమినల్ కోర్టులన్నియు సుప్రీం కోర్టునకు సహకారులుగా పనిచేయవలెను.

145 (i) పార్లమెంటు శాసనముల ననుసరించి అధ్యక్షుని అనుమతితో సుప్రీంకోర్టు దైనికవ్యవహారములకు సంబధించిన విషయములన్నిటిలోను నియమములను సుప్రీంకోర్టు చేయుచుండవచ్చును.

(ii) సుప్రీంకోర్టు తీర్పులన్నియు బహిరంగముగ కోర్టుభవనమునందు ప్రకటింపబడవలెను.

(iii) ఒక కేసున విచారించు న్యాయమూర్తుల సముదాయములో నధికసంఖ్యాకుల అభిప్రాయము ననుసంచి తీర్పు చెప్పబడవలెను. కాని అధికసంఖ్యాకుల అభిప్రాయముతో నేకీభవింపని న్యాయమూర్తి తన భిన్నాభిప్రాయమును ప్రకటింపవచ్చును.

146 సుప్రీంకోర్టు ఉద్యోగులను భారతదేశపు సుప్రీంకోర్టు ప్రధానన్యాయమూర్తిగాని ఆయన తరఫున మరియొకరుగాని నియమింపవలెను.

ఆయుద్యోగుల నియామకములో యూనియను పబ్లికు సర్వీస్ కమిషను సలహాతో జరుగవలెనని అధ్యక్షుడు నిర్ణయింపవలెను.

ఆయుద్యోగుల జీతములు, అల్లవెన్సులు, శెలవు, ఫించను మొదలగునవి అధ్యక్షుని అనుమతిని బట్టియుండవలెను.

సుప్రీంకోర్టు ఖర్చులన్నియు, ఉద్యోగుల జీతములతో గూడ, ఇండియా కన్సాలిడేటెడ్ ఫండునుండి వెచ్చింపబడవలెను. కోర్టు వసూలుచేసిన అన్నివిధముల ఫీజును ఆఫండులో నేచేరును.

147 ఈ అధ్యాయమునందును, ఆవర భాగము అయిదవ అధ్యాయమందును న్యాయశాస్త్ర సమస్య అను పదము 1935 సం. ఇండియా శాసనమునకును, 1947 సం. పు భారత స్వాతంత్ర్య శాసనమునకును వర్తించును.

148 భారతదేశపు కంప్ట్రోలరు ఆడిటరు జనరలు అను ఉద్యోగి అధ్యక్షునిచే నియమింపబడవలెను. అనవసరమని తోచినపుడు సుప్రీంకోర్టు న్యాయమూర్తులను

తొలగించు విధానము ననుసరించియే తొలగింపవలెను.

భారతదేశపు కంప్ట్రోలరు ఆడిటరుజనరలుగా నియమింపబడిన ఉద్యోగిపదవిని స్వీకరించుటకుముందు అధ్యక్షుని సమక్షము నగాని ఆయనతరపున మరియొకరి సమక్షమునగాని మూడవ షెడ్యూలులో నుదహరింపబడిన రీతిని ప్రమాణముచేయవలెను.

కంప్ట్రోలరు ఆడిటరు జనరలు జీతము, ఉద్యోగ నియమములు మున్నగునవి రెండవ షెడ్యూలు ననుసరించి పార్లమెంటు శాసనముచే నిర్ణయింపబడును.

ఒకసారి పైఉద్యోగముచేసి విరమించిన వ్యక్తి భారత ప్రభుత్వముక్రింద తిరిగి ఏయుద్యోగమునను ప్రవేశింపరాదు. ఇండియను ఆడిటు ఎక్కౌంటు డిపార్టుమెంటులోని ఉద్యోగులకు సంబంధించిన నియమములు కంప్ట్రోలరు ఆడిటరు జనరలు సలహాతో పార్లమెంటు శాసనమునకు లోబడి అధ్యక్షుడు చేయవలెను.

కంప్ట్రోలరు ఆడిటరు జనరలు కార్యాలయపు ఖర్చులు ఇండియా కన్సాలిడేటెడ్ ఫండునుండి వెచ్చింపబడవలెను.

149 పార్లమెంటు శాసనమననుసరించి యూనియను యొక్కయు రాష్ట్రముల యొక్కయు ఎక్కౌంటులకు సంబంధించిన విధులు కంప్ట్రోలరు ఆడిటరు జనరలు నిర్వర్తింపవలెను.

150 అధ్యక్షుని అనుమతితో కంప్ట్రోలరు ఆడిటరు జనరలు నిర్ణయించు విధానమునుబట్టి యూనియను యొక్కయు రాష్ట్రముల యొక్కయు ఎక్కౌంట్లు దాఖలు చేయబడవలెను.

151 యూనియను ఎక్కౌంట్లకు సంబంధించిన నివేదిక కంప్ట్రోలరు ఆడిటరు జనరలు తయారుచేసి అధ్యక్షుని సమక్షమున దాఖలుచేయవలెను. అధ్యక్షుడు ఆనివేదికను పార్లమెంటు నెదుట నుంపించును. రాష్ట్రములలో ఆ నివేదిక గవర్నరుకుగాని రాజప్రముఖునకుగాని పంపబడినమీదట రాష్ట్రీయ శాసనసభల యెదుట నుంచబడును.

## ఆ ర వ భా గ ము

### మొదటి షెడ్యూలు ఎ భాగమున నుదహరింపబడిన రాష్ట్రములు

### మొదటి అధ్యాయము—సామాన్యవిషయములు.

152 ఈభాగమున స్టేటు అను పదమునకు సాధారణముగ రాష్ట్రమని అర్థము.

### రెండవ అధ్యాయము—కార్యనిర్వాహకవర్గము

153 ఒక్కొక రాష్ట్రమున కొక్కొక గవర్నరుండవలయును.

154 రాష్ట్రపు కార్యనిర్వహణాధికారము గవర్నరునకు చెందియుండును. గవర్నరు తన అధికారములను స్వాయముగ గాని తనక్రింది యుద్యోగులద్వారాగాని అమలు జరుపవలెను.

ఒకానొక సందర్భమున కొన్ని అధికారములు గవర్నరు కాక ఇతరులకును చెందవచ్చును. పార్లమెంటును రాష్ట్రశాసన సభలును శాసనముచేసి కొన్ని అధికారములను గవర్నరుకు లోబడిన ఏ ఉద్యోగికైనను చెందునట్లు చేయవచ్చును.

155 రాష్ట్రపు గవర్నర్లు అధ్యక్షునిచే నియమింపబడుదురు.

156 (i) అధ్యక్షుని అనుమతి యున్నంతకాలము గవర్నరు పదవియందుండును.

(ii) స్వదస్తూరీతో అధ్యక్షునకు లేఖవ్రాసి గవర్నరు తన పదవికి రాజీనామా నీయవచ్చును.

(iii) పై నిబంధనలకు లోబడి గవర్నరు ఉద్యోగారంభము నుండి అయిదేండ్లు పదవియందుండవలెను. క్రొత్త గవర్నరుపదవి స్వీకరించువరకును ప్రాత గవర్నరే అధికారమున నుండును.

157 భారతదేశపౌరుడుగాని వ్యక్తియు, ముప్పదియైదేండ్లు వయసు లేనట్టి వ్యక్తియు గవర్నరుగ నియమింపబడరాదు.

158 (i) పార్లమెంటులో గాని రాష్ట్రశాసనసభలో గాని గవర్నరు సభ్యుడుగ నుండరాదు. పార్లమెంటు సభ్యుడు గాని, రాష్ట్రశాసన సభ్యుడుగాని గవర్నరుగా నియమింపబడినచో గవర్నరుపదవి స్వీకరించిన నాటి నుండి ఆసభలలో ఆయన సభ్యత్వము రద్దయినట్లు పరిగణింపబడును.

(ii) మరియొక విధముగ రాబడివచ్చు ఉద్యోగమేదియు గవర్నరు నిర్వహింపరాదు.

(iii) అద్దెలేకుండనే ప్రభుత్వ భవనములు గవర్నరు ఉపయోగించుటకు హక్కు గలిగియుండును. పార్లమెంటు నిర్ణయించు జీతమును, అల్లవెన్సులును, ప్రత్యేక సౌకర్యములును గవర్నరు అనుభవించుటకు హక్కుగలిగియుండును. అట్టి నిర్ణయము జరుగువరకును అవి రెండవ షెడ్యూలు ననుసరించియుండును.

159 పదవి నిర్వర్తించుటకు ముందు గవర్నరు దిగువ రీతిగ ప్రమాణమును హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి యెదుట స్వీకరింపవలెను.

రాష్ట్రపు గవర్నరుపదవిని నేను మనస్ఫూర్తిగా నిర్వహించుటకు అందుకు సంబంధించిన విధులను సక్రమముగా నెరవేర్చి, రాజ్యాంగ ప్రణాళిక సూత్రములను శక్త్యానుసారము సమర్థించి అనుసరించి ...... రాష్ట్రప్రజల క్షేమముకొరకు

నాయూవచ్ఛక్తిని వినియోగింతునని దేవునియెదుట ప్రమాణము చేయుచున్నాను.

160 హఠాత్తుగ తటస్థించు పరిస్థితులలో గవర్నరు విధుల నెరవేర్పబడుటకు అధ్యక్షు డుచితమగు రీతిని ఏర్పాటు చేయవలెను.

161 నేరస్థులకు విధింపబడిన శిక్షలు తగ్గించుట రద్దు చేయుట మొదలగునవి చేయుటకు గవర్నరునకు అధికారము గలదు.

162 ఈ రాజ్యాంగ ప్రణాళిక నిబంధనలకు లోబడి రాష్ట్రపు కార్యనిర్వహణాధికారము రాష్ట్రీయ శాసనసభలకు గూడ వర్తించును.

163 గవర్నరు తన విధులు నెరవేర్చుటలో ప్రధానమంత్రి నాయకత్వమున నొక మంత్రివర్గము సలహానిచ్చుచుండవలెను. తన ప్రత్యేక విచక్షణ నుపయోగించి గవర్నరు నిర్వర్తింపవలసినవిధుల కట్టి మంత్రివర్గపు సలహా వర్తింపదు.

ప్రత్యేక విచక్షణ నుపయోగించుటలో గవర్నరు అభిప్రాయము నాక్షేపించుటకు వీలులేదు. మంత్రివర్గము గవర్నరు కెట్టి సలహానిచ్చినదనుఅంశముగూర్చినుపన్యాయస్థానమును విచారణ జరపుటకు వీలులేదు.

164 (i) ప్రధానమంత్రిని గవర్నరు నియమింపవలెను. ఇతర మంత్రులను ప్రధాన మంత్రి సలహాపై గవర్నరు నియమింపవలెను. గవర్నరు అనుమతియున్నంతకాలము మంత్రులు తమ పదవులలో నుండవచ్చును.

బీహారు, మధ్యప్రదేశము, ఒరిస్సాలలోమాత్రము కొండజాతుల క్షేమమును చూచుట కొరక ప్రత్యేకమంత్రియుండవలెను. ఆ మంత్రి వెనుకబడిన జాతులు హారిజనులు మున్నగువారి క్షేమము గూడ చూడవచ్చును.

(ii) రాష్ట్రీయ లెజిస్లేటివ్ ఎసెంబ్లీకి మంత్రివర్గము సమిష్టి భాధ్యత వహింపవలెను.

(iii) మంత్రిపదవి విధులు నెరవేర్చుటకు ముందొక్కొక మంత్రియు గవర్నరు నెదుట మూడవ షెడ్యూలులో నుదహరింపబడిన రీతిని ఉద్యోగరహస్యప్రమాణములు స్వీకరింపవలెను.

(iv) వరుసగా ఆరునెలలకాలము శాసన నిర్మాణ సభల సమావేశములకు హాజరుగాని మంత్రి తన పదవిని గోల్పోవును.

(v) మంత్రుల జీతములును, అల్లవెన్సులును రాష్ట్రీయ శాసనసభ నిర్ణయింపలెను. అట్టి నిర్ణయము జరుగు వరకును అవి రెండవ షెడ్యూలులో నుదహరింపబడిన రీతిగ నుండును.

165 (i) హైకోర్టు న్యాయమూర్తిగ పనిచేయుట కర్హతగల యొక వ్యక్తిని ఆరాష్ట్రపు అడ్వకేటు జనరలుగ గవర్నరు నియమింపవలెను.

(ii) న్యాయశాస్త్ర విషయములనుగూర్చి రాష్ట్రప్రభుత్వమునకు సలహా నిచ్చుటయు, గవర్నరు ఆయా సమయములలో నిర్ణయించు న్యాయశాస్త్రీయ కార్యములు నిర్వర్తించుటయు, రాజ్యాంగ ప్రణాళిక ననుసరించి విధింపబడిన యితర కార్యముల జరపుటయు అడ్వకేటు జనరలు విధులు.

(iii) గవర్నరు అనుమతి యున్నంతకాలమును పదవియందుండి, గవర్నరుకు నిర్ణయించిన ప్రతిఫలమును అడ్వకేటు జనరలు తీసికొనవలెను.

166 రాష్ట్రప్రభుత్వకార్య నిర్వహణమంతయు గవర్నరు పేరనే జరుగవలెను.

గవర్నరు తరపున జారీచేయబడిన ఉత్తరువులన్నియు గవర్నరుచేసినట్లుగనే భావింపబడవలెను.

రాష్ట్రప్రభుత్వము నడపుటలో సౌకర్యమునకై అవసరమగు నియమములను గవర్నరుచేయవలెను.

167 ప్రధానమంత్రివిధులు దిగువరీతిగ నుండును.

(i) మంత్రివర్గ సమావేశ నిర్ణయములను, శాసనములకు ప్రతి

పాదనలును ప్రధానమంత్రిరాష్ట్రి గవర్నరుకు తెలుపు చుండవలెను.

(ii) గవర్నరున కవసరమని తోచిన రాజకీయ వ్యవహారములును గూర్చియు శాసన నిర్మాణ ప్రతిపాదనలును గూర్చియు గవర్నరునకు తగిన సమాచారములు తెలుపుచుండవలెను.

(iii) ఏ మంత్రిచేసిన నిర్ణయమునైనను మంత్రివర్గములో తగురీతిని చర్చింపవలెనని గవర్నరు కోరినపుడు ప్రధాన మంత్రి ఆ అంశమును మంత్రివర్గపుచర్చలో నుంచవలెను. అదివరకు మంత్రివర్గము చేసియుండిన నిర్ణయమునకిది వర్తింపదు.

మూడవ అధ్యాయము-రాష్ట్రీయశాసన నిర్మాణశాఖ

168 ఒక్కొక రాష్ట్రమునకును (స్టేటునకును) శాసననిర్మాణ శాఖయుండవలెను. అందు (i) గవర్నరును (ii) బీహారు, బొంబాయి, మదరాసు, పంజాబు, ఉత్తరప్రదేశ, పశ్చిమబంగాళములలో రెండుసభలును, మిగిలిన రాష్ట్రములలో ఒక్కసభయు నుండవలెను.

రెండు శాసననిర్మాణ సభలున్నచోట్ల ఒకటి లెజిస్లేటివు కౌన్సిలు అనియు రెండవది లెజిస్లేటివు ఎసెంబ్లీఅనియు పేర్లు గలిగియుండును. ఒకే సభయున్నచోట్ల లెజిస్లేటివు అసెంబ్లీ యనబడును.

169 పైనిబంధనతో నిమిత్తములేకుండ ఒక రాష్ట్రమందలి లెజిస్లేటివు కౌన్సిలు అనవసరమని తోచినచో పార్లమెంటు శాసనముచేసి దానిని రద్దుపరుపవచ్చును; లెజిస్లేటివు కౌన్సిలు లేని రాష్ట్రములలో ఆసభను సృష్టింపవచ్చును. ఇందులకు ఆయారాష్ట్రపు లెజిస్లేటివు అసెంబ్లీలోని సభ్యులలో అధిక సంఖ్యాకులును, సమావేశమునకు హాజరైన సభ్యులలో మూడింట రెండువంతులును తీర్మానము చేయవలసియుండును.

170 రాష్ట్రమందలి లెజిస్లేటివు ఎసెంబ్లీ సభ్యులు ప్రత్యక్ష ఎన్నిక విధానముచే ఎన్నుకొనబడవలెను.

రాష్ట్రపు లెజిస్లేటివు ఎసెంబ్లీ నియోజక వర్గములలో ఒక్కొక్కింటికిని జనాభాలో డెబ్బది అయిగువేలమందికి ఒక్కొక్క ప్రతినిధియుండవలెను.

ఏరాష్ట్రపు ఎసెంబ్లీలోను మొత్తము సభ్యులు అయిదు వందలకు మించరాదు. అరువదికి తగ్గరాదు.

171 (i) రాష్ట్రపు లెజిస్లేటివు ఎసెంబ్లీలోని సభ్యుల సంఖ్యలో నాల్గవ వంతుకంటె ఎక్కువ మంది ఆరాష్ట్రపు లెజిస్లేటివు కౌన్సిలులో నుండరాదు. కాని ఏరాష్ట్రపు లెజిస్లేటివు కౌన్సిలులోను నలుబది మందికి తక్కువ సభ్యులుండరాదు.

(ii) లెజిస్లేటివు కౌన్సిలుసభ దిగువరీతిని నిర్మింపబడవలెను.

(ఎ) మూడవ వంతు సభ్యులు రాష్ట్రమందలి స్థానిక సంస్థలచే ఎన్నుకొనబడవలెను.

(బి) రాష్ట్రమందు స్థిరనివాసముగల్గి విశ్వవిద్యాలయములో అధమము మూడేండ్లు పట్టభద్రులై యున్న వారిచే పండ్రెండవ వంతున సభ్యు లెన్నుకొనబడవలెను.

(సి) అధమము సెకండరీస్కూలు ప్రమాణముగల పాఠశాలలలో మూడేండ్లయినను ఉపాధ్యాయ వృత్తిలో గడపినవారు పండ్రెండవ వంతు సభ్యుల నెన్నుకొనవలెను.

(డి) రాష్ట్రపు ఎసెంబ్లీసభ్యులు లెజిస్లేటివు కౌన్సిలులో మూడవ వంతు సభ్యుల నెన్నుకొనవలెను. ఇట్లెన్నుకొనబడినవారు లెజిస్లేటివు ఎసెంబ్లీ సభ్యులై యుండరాదు.

(యి) మిగిలినవారు గవర్నరుచే నియోగింపబడుదురు.

పై (ఎ) (బి) (సి) ల లో నుదహరింపబడిన సభ్యులు పార్లమెంటు శాసనముచే నేర్పడిన నియోజక వర్గములనుండి యెన్నుకొనబడుదురు. (డి) లో నుదహరింపబడిన సభ్యులు ప్రపోర్షనల్ రిప్రజెంటేషను విధానము ననుసరించిన సింగిల్

ట్రాన్స్ఫరబుల్ వోటుచే నెన్నుకొనబడవలెను. (ఇ) లో నుదహరింపబడిన సభ్యులు సాహిత్యము, విజ్ఞానము, కళ, సహాకారోద్యమము, సంఘసేవ, ఇట్టి విషయములలో ప్రవీణులను గవర్నరు నియోగింపబడినవారుగ నుండవలెను.

172 రాష్ట్రీయ లెజిస్లేటివు ఎసెంబ్లీ మొదటి సమావేశము నుండి అయిదేండ్లు అమలులో నుండును. ఒక్కొకపుడీలోపుగను రద్దుచేయబడవచ్చును. అయిదేండ్ల పరిమితి ముగిసినను పార్లమెంటుశాసనముచే ఒక్కొకసారి సంవత్సరము చొప్పున పొడిగింపబడవచ్చును.

లెజిస్లేటివు కౌన్సిలు ఎప్పుడును రద్దుకానేరదు. రెండు సంవత్సరములకొకసారి మూడవ వంతు సభ్యుల సభ్యత్వమంత మొందవలెను.

173 రాష్ట్రశాసన సభ్యత్వమునకు క్రింది యోగ్యతలుండవలెను.

(i) భారత పౌరుడై యుండవలెను.

(ii) ఎసెంబ్లీ సభ్యత్వమునకు ఇరువది యైదేండ్లును లెజిస్లేటివు కౌన్సిలు సభ్యత్వమునకు ముప్పదియేండ్లు నుండవలెను.

(iii) పార్లమెంటు నిర్ణయించు ఇతరయోగ్యతలుండవలెను.

174 రాష్ట్రశాసన నిర్మాణసభలు సంవత్సరమున కధమము రెండుసార్లయినను సమావేశము కావలెను. ఒక సమావేశపు ముగింపునకును మరియొక సమావేశపు ఆరంభమునకును మధ్య ఆరునెలలకాలము దాటరాదు.

సమావేశముల స్థలమును కాలమును గవర్నరు నిర్ణయింపవలెను. గవర్నరు సమావేశములను వాయిదావేయ వచ్చును. లెజిస్లేటివు ఎసెంబ్లీని రద్దుచేయువచ్చును.

175 లెజిస్లేటివు ఎసెంబ్లీలోను, లెజిస్లేటివ్ కౌన్సిలు గల రాష్ట్రములలో రెండు సభల సంయుక్త సమావేశమున గవర్నరు ప్రసంగింప వచ్చును.

రాష్ట్రీయ శాసనసభలకు గవర్నరు ఏ బిల్లు విషయము నైనను సందేశము పంపవచ్చును. అట్టి సందేశమందిన వెంటనే శాసనసభ ఆవిషయమును చర్చింపవలెను.

176 శాసనసభల సమావేశారంభమున గవర్నరు ఆ సమావేశపు ఉద్దేశములు వివరించి ప్రసంగించును. సభ్యులు ఆప్రసంగమందలి విషయములనుగూర్చి చర్చించుట కవకాశముండవలెను.

177 మంత్రులును, అడ్వొకేటు జనరలును ఎసెంబ్లీ, కౌన్సిలు కార్యక్రమములలో నన్నివిధముల పాల్గొనవచ్చును గాని వోటు చేయుటకు వీలులేదు.

178 లెజిస్లేటివ్ ఎసెంబ్లీ సమావేశమైనవెంటనే ఒక సభ్యుని స్పీకరు (సభాపతి) గను, మరియొక సభ్యుని డిప్యూటి స్పీకరు (ఉపసభాపతి) గను ఎన్నుకొనవలెను. ఈ రెండు పదవులలో ఖాళీ ఏర్పడినపుడెల్ల ఇట్టి ఎన్నికలు జరుగవలెను.

179 (i) సభాపతిగాని, ఉపసభాపతిగాని ఎసెంబ్లీ సభ్యత్వము గోల్పోయిన వెంటనే ఆపదవిని గూడగోల్పోవును.

(ii) స్వదస్తూరీతో రాజీనామా లేఖ వ్రాసియిచ్చి ఆపదవి విడువ వచ్చును.

(iii) ఎసెంబ్లీలో అధికసంఖ్యాక సభ్యులు తీర్మానముచేసి సభాపతినిగాని, ఉపసభాపతినిగాని పదవినుండి తొలగింపవచ్చును.

(iv) ఎసెంబ్లీ రద్దయినవెంటనే స్పీకరుపదవి రద్దుగాక క్రొత్త ఎసెంబ్లీ మొదటి **సమావేశము** జరగువరకు నుండును.

180 సభాపతిపదవి **ఖాళీ**గానున్నపుడు సభాపతి విధులు ఉపసభాపతి నెరవేర్పవలెను; ఉపసభాపతి పదవిగూడ ఖాళీయైన గవర్నరుచే నియమింపబడిన సభ్యుడు సభాపతి విధులు నెరవేర్పవలెను.

ఒక సమావేశమున సభాపతి హాజరుకానిచో సభాపతి స్థానమున ఉపసభాపతి కార్యక్రమము నడపించును; ఉపసభాపతి

కూడ లేనిచో నియమానుసారము నిర్ణయింపబడిన వ్యక్తి ఆకార్యక్రమము నడపించును.

181 సభాపతినిగూర్చిగాని, ఉపసభాపతినిగూర్చిగాని తొలగింపు తీర్మానము చర్చజరుగుచున్నపుడు ఆయా పదవులలో నున్నవ్యక్తులు సభాధ్యక్షత వహింపరాదు. ఆచర్చకు సభాపతి సమాధాన మీయవచ్చునుగాని సభ్యుల వోట్లు చెరిసగమైనపు డతడు తనవోటు నీయరాదు.

182 రాష్ట్రీపు లెజిస్లేటివుకౌన్సిలు మొదటి సమావేశములో నొకసభ్యుడు పీఠపతి (చెయిర్మను) మరియొక సభ్యుడు డెప్యూటీ చెయిర్మను (ఉపపీఠపతి) గను ఎన్నుకొనబడవలెను.

183 (i) పీఠపతిగాని ఉపపీఠపతిగాని కౌన్సిలు సభ్యత్వము గోల్పోయినచో తన పదవినిగూడ గోల్పోవును.

(ii) స్వదస్తూరీతో రాజనామాలేఖ వ్రాసి తన పదవిని వదలవచ్చును.

(iii) కౌన్సిలులో అధిక సంఖ్యాక సభ్యుల వోట్లచే పదవి నుండి తొలగింపబడవచ్చును.

184 పీఠపతి పదవిగూడ ఖాళీగనున్నపుడు, ఉపపీఠపతినెరవేర్పవలెను. ఉపపీఠపతి పదవిగూడ ఖాళీగ నున్నచో ఆవిధులు నెరవేర్చుటకు ఒక సభ్యుని గవర్నరు నియమింపవలెను. పీఠపతి హాజరుకానపుడు కౌన్సిలులో ఆయన విధులు ఉపపీఠపతిగాని నియమానుసారము మరియొక సభ్యుడుగాని ఆవిధులు నెరవేర్పవలెను.

185 పీఠపతినిగూర్చిగాని ఉపపీఠపతినిగూర్చిగాని కౌన్సిలులో తొలగింపు తీర్మానము చర్చజరుగుచున్నపుడు ఆయుప పదవులలోనున్న వ్యక్తులు అధ్యక్ష పీఠమున నుండ రాదు. చర్చకు సమాధానము చెప్పుటకు పీఠపతికి అవ కాశముండునుగాని సభ్యుల అభిప్రాయము చెరిసగ ముగా నున్నపుడు పీఠపతి తనవోటు నీయరాదు.

186 సభాపతి, ఉపసభాపతి, పీఠపతి, ఉపపీఠపతి వీరిజీతము లను అల్లవెన్సులను రాష్ట్రీయశాసన సభ నిర్ణయింప వలెను. అట్టినిర్ణయము జరుగు వరకును అవి రెండవ షెడ్యూలు ననుసరించియుండును.

187 లెజిస్లేటివ్ ఎసెంబ్లీ, లెజిస్లేటివు కౌన్సిలు సభలకు సంబంధించి వేరువేరుగ గాని ఉమ్మడిగగాని ఉద్యోగి బృందముండవలెను. ఆఉద్యోగులకు సంబంధించిన నియమములు రాష్ట్రీయ శాసనసభలు నిర్ణయింప వలెను. అట్టి నిర్ణయము జరగువరకును సభాపతి, పీఠపతుల సలహాతో గవర్నరు వానిని నిర్ణయించును.

188 ఎసెంబ్లీ, కౌన్సిలుసభలలో సభ్యత్వము వహింపక ముందు సభ్యులందరును గవర్నరు సమక్షమునగాని ఆయనపక్షమున మరియొకరి సమక్షమునగాని మూడవ షెడ్యూలు ననుసరించి ప్రమాణము స్వీకరింపవలెను.

189 సాధారణముగ శాసనసభలలోని ప్రతిపాదన లన్నియు అధికసంఖ్యాకమగు వోట్లచే నిర్ణయింపబడును.

సభాధ్యక్షుడు వోటుచేయరాదు; కాని సభ్యులు చెరిసగముగవోట్లు నిచ్చినపుడు సభాధ్యక్షుడు వోటు చేయవలెను.

190 (i) ఏవ్యక్తియును రెండు రాష్ట్రీయ శాసన సభలలోను సభ్యత్వము వహింపరాదు.

(ii) వరుసగ అరువదిరోజు లేకవ్యక్తి శాసనసభ అనుమతి లేక సమావేశములనుండి గైరుహాజరైనచో తన సభ్యత్వమును గోల్పోవును.

191 దిగువ పేర్కొనబడినవారు రాష్ట్రీయ శాసనసభలలో సభ్యులుగానుండుట కర్హులుగాగు:—

(i) మొదటి షెడ్యూలునం దుదహరింపబడిన రాష్ట్రములలో కేంద్రరాష్ట్రీయోద్యోగులు.

(ii) మతిస్థిమితము లేనివారు.

(iii) దివాలా తీసినవారు.

(iv) భారతపౌరులు కానివారు, విదేశములలో పౌరత్వము పొందినవారు.

(v) పార్లమెంటు శాసనము ననుసరించి ఏవిధమునవైన అర్హత లేనివారు.

192 సభ్యుల అర్హతవిషయమై వివాదము కల్గినపుడు ఎలెక్షను కమిషను సలహాను పొంది గవర్నరు పరిష్కారము చేయవలెను.

193 అర్హతలేదని తెలిసియుండియు ఏవ్యక్తియైనను శాసనసభ కార్యక్రమములో పాల్గొనినచో అతడట్లుపాల్గొనిన ఒక్కొక రోజునకును అయిదువందల రూపాయలు చొప్పున ప్రభుత్వమున కపరాధమును చెల్లింపవలెను.

194 (i) రాజ్యాంగ ప్రణాళిక సూత్రములకు భంగము లేనంతవరకు రాష్ట్రీయశాసన సభ్యులకు వాక్స్వాతంత్ర్యముండవలెను.

(ii) శాసనసభలలోచేసిన ప్రసంగముల విషయమునను, ఇచ్చిన వోటు విషయమునను ఏ సభ్యునిపైనను న్యాయస్థానమున చర్య జరుపబడరాదు.

(iii) సాధారణముగ బ్రిటిషు పార్లమెంటుసభ్యులకుండు అధికారములు, హక్కులు, మినహాయింపులు మొదలైనవి రాష్ట్రీయ శాసనసభ్యులకు నుండును.

195 రాష్ట్రీయశాసనసభలు చేసిన శాసనముల ననుసరించి ఆసభల జీతములును, అలవెన్సులు నుండవలెను.

196 (i) ధనసంబంధమగుబిల్లులు తప్పమిగిలిన బిల్లులుఎసెంబ్లీలోగాని కౌన్సిలులోగాని మొదటిసారిగ ప్రతిపాదింపబడవచ్చును.

(ii) ఎసెంబ్లీ, కౌన్సిలుసభల రెండింటిలోను తీర్మానింపబడిన బిల్లులే సాధారణముగ నెగ్గినట్లు పరిగణింపబడును. (కౌన్సిలులేని రాష్ట్రములకిది వర్తింపదు).

(iii) సమావేశము వాయిదా పడిన మాత్రమున ఏ బిల్లునకును కాలదోషము లేదు.

(iv) ఎసెంబ్లీయందు తీర్మానింపబడి కౌన్సిలులో చర్చ, యందున్న బిల్లు ఎసెంబ్లీ రద్దయిన మాత్రమున కాలదోషము పొందదు.

(v) ఎసెంబ్లీలో చర్చయందున్నట్టిదిగాని, ఎసెంబ్లీలో తీర్మానింపబడి కౌన్సిలులో చర్చయందున్నట్టిదిగాని బిల్లు ఎసెంబ్లీ రద్దయినచో కాలదోషము పొందును.

197 ఒకబిల్లు ఎసెంబ్లీలో తీర్మానమై కౌన్సిలులో ప్రవేశ పెట్టబడిన మీదట కౌన్సిలు దానిని తిరస్కరించినను, దానికి సవరణలు చేసినను, ఎట్టి తీర్మానమును చేయక మూడు నెలలు కౌన్సిలు ఆబిల్లును వదలివేసినను—ఎసెంబ్లీలో తిరిగి ఆబిల్లు తీర్మానమై కౌన్సిలులో ప్రవేశ పెట్టబడి కౌన్సిలు దానిని తిరస్కరించినను, సవరణలు చేసినను, ఏచర్యయు తీసికొనక మూడు నెలల వరకు వదలివేసినను – ఆబిల్లు ఎసెంబ్లీ తీర్మానించిన రీతిగ తీర్మానమైనట్లే పరిగణింపబడును. ఈ నియమము ధన సంబంధమగు బిల్లులకు వర్తింపదు.

198 (i) ధనసంబంధమగు బిల్లులు లెజిస్లేటివు కౌన్సిలులో ప్రవేశ పెట్టబడరాదు.

(ii) ధనసంబంధమగు బిల్లు ఎసెంబ్లీలో తీర్మానింపబడి కౌన్సిలుకు పంపబడిన మీదట పదునాల్గు దినములలో కౌన్సిలు ఆబిల్లు నట్లేగాని, సవరణలతోగాని, తీర్మానించి ఎసెంబ్లీకి తిరిగి పంపవలెను. కౌన్సిలు సవరణలు కొన్నిగాని అన్నియుగాని ఎసెంబ్లీ అంగీకరింపవచ్చును. లేక నిరాకరింపవచ్చును.

(iii) ధనసంబంధమగు బిల్లు ఎసెంబ్లీ తీర్మానించిన రూపమునే నెగ్గినట్లుగ పరిగణింపబడును.

(iv) ఎసెంబ్లీనుండి కౌన్సిలుకు ధనసంబంధమగు బిల్లు పంపబడి పదునాలుగు రోజులతిక్రమించినను కౌన్సిలు ఎట్టి చర్యను తీసికొననిచో ఆబిల్లును రెండుసభలును తీర్మానించినట్లే ఎంచబడును.

199 క్రిందిలక్షణములుగలది ధనసంబంధమగుబిల్లుఅనబడును.

(i) పన్నుల తగ్గింపు, రద్దు, విధింపు.

(ii) రాష్ట్రప్రభుత్వఋణములు.

(iii) కన్సాలిడేటెడ్ ఫండు కంటింజెంటుఫండులలో చేర్చుట, వానినుండి తీయుట.

(iv) రాష్ట్రకన్సాలిడేటెడ్ ఫండునుండి ఖర్చులు.

పై వానికి సంబంధించిన ఇతరవిషయములు.

ధనసంబంధమగు బిల్లు అగునా? కాదా? అనునది ఎసెంబ్లీ సభాపతిచే నిర్ణయింపబడవలెను. ధనసంబంధ

మగు బిల్లు లెజిస్లేటివు కౌన్సిలకును, గవర్నరు అంగీకార ముకొరకును పంపునపుడు సభాపతి దానిపై విధాన సంబంధమగు బిల్లు అని ధ్రువపరుపవలెను.

200 ఒక బిల్లు రాష్ట్రి ఎసెంబ్లీలోను, కౌన్సిలులోను తీర్మానమైన మీాదట అది గవర్నరు అంగీకారమునకు దాఖలు చేయబడవలెను. గవర్నరు దాని నంగీకరింప వచ్చును. లేక అధ్యక్షుని నిర్ణయము కొరకు ఆపి యుండవచ్చును.

గవర్నరు అంగీకారమునకు పంపబడినబిల్లు (ధనసంబంధ మగు బిల్లుకానిపక్షము) కు ఆయన అంగీకారమీాయని సందర్భములో కొన్ని సవరణలు సూచించి ఆబిల్లును పునరాలోచన చేయవలసినదని సందేశముతో గవర్నరు శాసనసభలకు పంపవచ్చును. ఆసవరణలతోగాని అవి లేకుండ గాని శాసన సభలు ఆ బిల్లును తీర్మానించి తిరిగి గవర్నరు అంగీకార మునకు పంపినపుడు గవర్నరు ఆబిల్లున కంగీకారము ఇయ్యవలెను.

కాని ఒకబిల్లు శాసనమైనచో హైకోర్టు అధికారము లకు భంగముకల్గి ఉపద్రవమేర్పడునని గవర్నరు అభిప్రాయమైనచో ఆబిల్లును అధ్యక్షుని అంగీకారమునకు గవర్నరు పంప వచ్చును.

201 అధ్యక్షుని అంగీకారమునకు పంపబడిన బిల్లునకు ఆయన అంగీకారము తెలుపవచ్చును. లేక అంగీకారమునిలుపుదల చేయవచ్చును. ఒక్కొకపుడు ధనసంబంధముకాని బిల్లులకు పునరాలోచన చేయవలసినదిగా శాసనసభలను కోరవలెను. అధ్యక్షుడు గవర్నరున కుత్తరువు పంపవచ్చును. శాసనసభలు అట్టిబిల్లులను సవరణాలతోగాని అట్లేగాని ఆరునెలలలో తీర్మానించి తిరిగి అధ్యక్షుని అంగీకారమునకు పంపవచ్చును.

202 ఒక్కొక ఆర్థిక సంవత్సరమునకును సంబంధించినసాంవత్సరిక ఆర్థిక పట్టిక రాష్ట్రశాసనసభల యెదుట నుంచబడునట్లు గవర్నరు ఏర్పాటు చేయవలెను. ఆపట్టికలో కన్సాలిడేటెడ్ ఫండునుండి ఖర్చులు, రివెన్యూ అక్కౌంటు ఖర్చులు మున్నగు వివరములు వేర్వేరుగా చూపబడవలెను. గవర్నరు రాష్ట్రీయ శాసనసభాపతి. పీఠపతి, ఉపసభాపతి, ఉపపీఠపతి, శాసనసభ్యులు, హైకోర్టుజడ్జీలు—మున్నగువారి జీతములు మొదలగు ఖర్చులు కన్సాలిడేటెడ్ ఫండునుండి వెచ్చింపబడవలెను.

203 కన్సాలిడేటెడ్ఫండు ఖర్చులపై శాసనసభ్యులు చర్చింపవచ్చునుగాని వోటుచేయరాదు.

మిగిలిన బాపతుల ఖర్చు అంచనాలు శాసనసభ్యులు చర్చించి వాని నట్లేగాని, తగ్గించిగాని మంజూరు (గ్రాంటు(

చేయవలెను. గ్రాంటులన్నియు గవర్నరు సిఫారసు ననుసరించి యే కోరబడవలెను.

204 వెనుకటి నిబంధన ననుసరించి చేయబడిన గ్రాంటుల పిదప కన్సాలిడేటెడ్ ఫండు ఖర్చులకొరకు ఒక బిల్లు శాసనసభలలో ప్రవేశపెట్టబడవలెను. వానిని శాసన సభ్యులు చర్చించి మార్పులు చేయక అంగీకరింపవలసి యుండును.

205 అంచనాలనుబట్టి ఒక సంవత్సరమునకు ఖర్చులు చాలనిచో శాసనసభలలో అదనపు గ్రాంటులు మంజూరు చేయబడుటకు గవర్నరు ఏర్పాట్లు చేయవలెను.

206 పైనిబంధనలతో నిమిత్తములేకుండ అవసర పరిస్థితు లనుబట్టి గ్రాంటులను ముందుగనె మంజూరు చేయు టకును, అసాధారణ పరిస్థితులలో నుపయోగించుటకు తగిన ధనపు గ్రాంటులు మంజూరుచేయుటకును, రాష్ట్రీయ లెజిస్లేటివు ఎసెంబ్లీకి అధికారముండును.

207 పై 199 వ నిబంధనకుసంబంధించిన బిల్లులు గవర్నరు శిఫారసుమీదటనే ప్రతిపాదింపబడవలెను. అట్టి బిల్లు లెజిస్లేటివు కౌన్సిలులో ప్రతిపాదింపబడరాదు. రాష్ట్రకన్సాలిడేటెడ్ ఫండునుండి యగు ఖర్చుకు సంబంధించినబిల్లు గవర్నరు సిఫారసులేనిదే రాష్ట్రశా సనసభ తీర్మానింపరాదు.

208 రాష్ట్రీయ శాసనసభ కార్యక్రమ నిర్వహణమునకు తగిన నియమములను ఆసభ చేయవచ్చును. అంతవర కును ఈరాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి వచ్చుసరికి అనుసరింపబడుచున్న నియమములు ఎసెంబ్లీకి సభాపతి యును, లెజిస్లేటివు కౌన్సిలుకు పీఠపతియును చేయు సవరణలతో అమలు జరుపవలెను. లెజస్లేటివ్ ఎసెంబ్లీ లెజిస్లేటివ్ కౌన్సిలులమధ్య ఉత్తరప్రత్యుత్తరములు నడచుటకు సభాపతి, పీఠపతుల సలహాతో గవర్నరు ఏర్పాట్లు చేయవలెను.

209 ధనసంబంధమగు బిల్లుల విషయమునను, ఇతరార్థిక విష యములలోను సకాలములో సక్రమముగా కార్యక్రమ మునడచుట కవసరమగు నిబంధనలు రాష్ట్రశాసన సభలు చేయవచ్చును. ఆ నిబంధనలు నిరాక్షేపణగా అమలు జరుగవలెను.

210 రాష్ట్రశాసనసభల కార్యక్రమము, ఆరాష్ట్రపు రాజకీయ భాషలలోగాని, హిందీలోగాని ఇంగ్లీషులోగాని జరుగ వలెను. పైనచెప్పబడిన భాషలయందు దేనిలోను ఒక సభ్యుడు తన యభిప్రాయములు ప్రకటింపలేనిచో ఆస భ్యుడు మాతృభాషలో మాటలాడుటకు సభాపతి (పీఠ పతి) అనుమతి నీయవచ్చును.

పదునైదేండ్ల పిదప పైభాషలలో ఇంగ్లీషు తొలగి పోవలెను.

211 సుప్రీంకోర్టు న్యాయమూర్తుల యొక్క చర్యలగూర్చి గాని, హైకోర్టు న్యాయమూర్తుల చర్యలగూర్చిగాని రాష్ట్రశాసన సభలలో చర్చ జరుగరాదు.

212 రాష్ట్రశాసన సభల కార్యక్రమముయొక్క న్యాయాన్యాయములు న్యాయస్థానములలో విచారింపబడరాదు. రాష్ట్రశాసనసభల కార్యక్రమము నడపు ఉద్యోగుల చర్యలు న్యాయస్థానములో విచారింపబడరాదు.

213 రాష్ట్రశాసనసభా సమావేశములు జరుగని సమయమున సత్వరచర్య అవసరమని తోచిన పక్షమున గవర్నరు ఆర్డినెన్సు (అసాధారణ శాసనము) అమలు జరుపవచ్చును.

అట్టి ఆర్డినెన్సు నమలు జరపుటలో గవర్నరు అధ్యక్షుని అనుమతి పొందవలెను.

ఇట్టి ఆర్డినెన్సు శాసనసభ చేసిన శాసనముయొక్క అధికారము గల్గియుండును.

శాసనసభ సమావేశమైన ఆరువారములకు ఆర్డినెన్సు రద్దగును.

శాసన సభల తీర్మానముచే ఆర్డినెన్సు రద్దుచేయవచ్చును.

గవర్నరు ఆర్డినెన్సును ఉపసంహరింపవచ్చును.

## ఆయిదవ అధ్యాయము - రాష్ట్రములలో హైకోర్టులు

214 రాష్ట్రమునకొక హైకోర్టు ఉండవలెను.

ఈ రాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి వచ్చుపరికి ఉన్న హైకోర్టుల కన్నిటికిని ఈఅధ్యాయమునందలి నిబంధనలు వర్తించును.

215 ప్రతి హైకోర్టునకును పత్రములు దాఖలు చేసికొను అధికారముండును. ఏ హైకోర్టునకు జరగిన కోర్టు ధిక్కారమును శిక్షించుట కాహైకోర్టునకే అధికారముండును.

216 ప్రతి హైకోర్టునందును ఒక ప్రధాన న్యాయమూర్తియు అధ్యక్షుడు నిర్ణయించు సంఖ్యకులోబడి సాధారణ న్యాయమూర్తులు నుందురు.

217 హైకోర్టు న్యాయమూర్తులందరును అధ్యక్షునిచే నియమింపబడవలెను; అట్లు నియమించుటలో భారతప్రధాన న్యాయమూర్తితోను, రాష్ట్రపు గవర్నరుతోను, సాధారణ న్యాయమూర్తుల నియామకములో ఆరాష్ట్రపు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తితోను సంప్రదించవలెను.

హైకోర్టు జడ్జి అరువదియేండ్ల వయస్సు వచ్చువరకును ఉద్యోగమున నుండవచ్చును.

అధ్యక్షునకు స్వదస్తూరితో రాజీనామా లేఖ వ్రాసి ఏన్యాయమూర్తియైనను తన ఉద్యోగము మాని వేయవచ్చును.

పై 124 వ నిబంధనలో చెప్పబడిన విధముగా సుప్రీం కోర్టు న్యాయమూర్తిని తొలగించిన రీతిగనే అధ్యక్షుడు హైకోర్టు న్యాయమూర్తిని ఉద్యోగమునుండి తొలగింపవచ్చును.

ఒక హైకోర్టునుండి మరియొక హైకోర్టుకు న్యాయమూర్తులను అధ్యక్షుడు బదలాయించవచ్చును.

భారతపౌరుడుగాని వ్యక్తియు, పదేండ్లు భారత దేశమున న్యాయశాఖయందుద్యోగము చేయనట్టి వ్యక్తియు, పదేండ్లు ఏహైకోర్టులోనైనను అడ్వకేటుగా పనిచేయనట్టి వ్యక్తియు హైకోర్టు న్యాయమూర్తిగా నియమింపబడుట కర్హుడుగాడు.

218 పై 124 వ నిబంధనలో సుప్రీంకోర్టు విషయమున పేర్కొనబడిన అంశములు హైకోర్టులకును వర్తించును.

219 హైకోర్టు న్యాయమూర్తిగ నియమింపబడిన వ్యక్తి ఉద్యోగము నిర్వహించుటకు ముందుగా రాష్ట్రగవర్నరు సముఖమునగాని ఆయనతరపున మరియొకరి సముఖమున గాని మూడవ షెడ్యూలులో చెప్పబడినట్లు ప్రమాణము స్వీకరింపవలెను.

220 ఈ రాజ్యాంగప్రణాళిక అమలులోనికి వచ్చినపిదప హైకోర్టు న్యాయమూర్తిగా నియమింపబడిన వ్యక్తి

యెవరును ఉద్యోగమునుండి విరమించినపిదప భారత దేశమున ఏన్యాయస్థానమందును న్యాయవాదిగ పని చేయరాదు.

221 రెండవ షెడ్యూలులో నిర్ణయింపబడిన ప్రకారము హైకోర్టు న్యాయమూర్తులకు జీతము లీయవలెను.

పార్లమెంటు శాసనము ననుసరించి హైకోర్టు న్యాయమూర్తులకు శెలవునకును, ఫించనుకును హక్కుండును. అట్టి నిర్ణయము జరగువరకును అవి రెండవ షెడ్యూలు ననుసరించి యుండును.

222 ఒక హైకోర్టునుండి మరియొక హైకోర్టునకు ఒక న్యాయమూర్తి బదలాయింపబడినపుడు పార్లమెంటుగాని అధ్యక్షుడుగాని నిర్ణయించు అదనపు మొత్తము ఆయన జీతమునకు చేర్చి ఈయబడును.

222 ప్రధాన న్యాయమూర్తి తన విధు లేకారణముచేతనైనను నెరవేర్చలేనపుడు ఆయన తరపున ఆవిధులు నెరవేర్చుటకు మరియొక న్యాయమూర్తిని అధ్యక్షుడు నియమించవలెను.

224 అధ్యక్షుని అనుమతి పొంది ఒక హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఆయా అవసరములనుబట్టి విశ్రాంతిగైకొనిన (రిటైరు అయిన) న్యాయమూర్తిని తాత్కాలికముగ న్యాయస్థానమున పనిచేయుటకు నియమింప

వచ్చును. తాత్కాలిక న్యాయమూర్తి జీతము అధ్యక్షుడు నిర్ణయింపవలెను.

225 జూరిస్‌డిక్షను, న్యాయశాస్త్రము న్యాయమూర్తుల అధికారములు మున్నగు విషయములలో ఈ రాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి వచ్చుసరికి హైకోర్టులకు వర్తించుచుండిన అంశములే ఇకముందును సాధారణముగ వర్తించును. ఈ రాజ్యాంగ ప్రణాళిక నియమములందుకు భిన్నముగా నున్నచో ఈరాజ్యాంగ ప్రణాళిక నియమములే వర్తించును.

226 పై 32 వ నిబంధనతో నిమిత్తము లేకుండా ఒక హైకోర్టు జూరిస్‌డిక్షన్ క్రిందగల ప్రాంతములలోని ఏవ్యక్తికైనను, సంస్థకైనను, ప్రభుత్వముకైనను హెబియస్ కార్పస్, మాండమస్, నిషేధము, కోవారంటో సర్షియోరరై మున్నగుఉత్తరువులిచ్చుటకును, మూడవ భాగములోని హక్కులు అమలు జరపుటకును సుప్రీంకోర్టు అధికారమునకు లోబడి ప్రతి హైకోర్టునకు అధికారముండును.

227 ఒకహైకోర్టు జూరిస్‌డిక్షన్‌క్రిందనున్న అన్నివిధములగు న్యాయస్థానములమీదను తనిఖీ చేయుటకు ఆహైకోర్టుకధికారముండును. సైనికస్థానమునకీనిబంధనవర్తింపదు.

228 ఒక హైకోర్టుజూరిస్‌డిక్షను క్రిందికోర్టున విచారణ జరుగుచున్న ఒక కేసులో ఈరాజ్యాంగప్రణాళిక ప్రణాళికకు వ్యాఖ్యానము చేయుటలో నొక క్లిష్టమగు ధర్మసందేహ మిమిడియున్నదని ఆ హైకోర్టువారికి తోచినచో ఆకేసును హైకోర్టువారే విచారించవచ్చును. లేక ఆ క్లిష్ట ధర్మశాస్త్రవిషయముపై తీర్పు చెప్పి ఆ తీర్పు ననుసరించి కేసు విచారణ జరుపవలెనని క్రింది కోర్టు కుత్తరువు పంపవచ్చును.

229 హైకోర్టు ఉద్యోగుల నియామకము ప్రధాన న్యాయమూర్తి చేయవలెను. ఒక్కొకపుడు కొన్ని సందర్భములలో నట్టి నియామకములు పబ్లిక్ సర్వీసు కమిషను సంప్రదింపుతో జరుపబడవలెనని గవర్నరు నిర్ణయింపవచ్చును.

హైకోర్టు ఉద్యోగులకు సంబంధించిన నిబంధనలు ప్రధాన న్యాయమూర్తిచేయవలెను. ఆ ఉద్యోగుల జీతములు, అల్లవెన్సులు, పింఛనులు మున్నగునవి గవర్నరు అనుమతిని పొందవలెను.

230 పార్లమెంటు శాసనమువలన ఒక హైకోర్టుజూరిస్‌డిక్షను ఎక్కువైనను కావచ్చును. తక్కువైనను కావచ్చును.

231 ఒక్కొకపుడు హైకోర్టుజూరిస్‌డిక్షను రాష్ట్రమున నతిక్రమించియుండవచ్చును. కాని అంతమాత్రమున

రాష్ట్రీయ శాసనసభల శాసన నిర్మాణాధికారము రాష్ట్రమును మించియుండదు.

232 ఒక హైకోర్టు జూరిస్‌డిక్షను రాష్ట్రమును దాటినను ఆ హైకోర్టు ప్రధానకార్యాలయమున్న రాష్ట్రపు గవర్నరే ఆ హైకోర్టు నిబంధనల కనుమతి యీయవలెను.

233 హైకోర్టును సంప్రదించి గవర్నరు జిల్లా జడ్జిలను నియమింపవలెను. యూనియను, రాష్ట్రముల ప్రభుత్వోద్యోగి కాకుండను౦డి ఏడేండ్లు న్యాయవాదవృత్తియందనుభవముగల వ్యక్తి జిల్లాజడ్జిగా నియమింపబడుట కర్హుడై యుండును.

234 జిల్లా జడ్జిలుతప్ప ఇతర న్యాయశాఖోద్యోగులను పబ్లికు సర్వీస్‌కమిషన్, హైకోర్టుల సంప్రదింపుతో గవర్నరు నియమించవలెను.

235 జిల్లాకోర్టులలోను వానిక్రిందికోర్టులలోనుండు ఉద్యోగుల బదలాయింపు శెలవు, ప్రమోషను మొదలగునవి హైకోర్టు ఆధీనమున నుండవలెను. హైకోర్టు ఉత్తరువుపై అప్పీలుచేసికొనుట కవకాశముండవలెను. శాసనమును నిబంధనలను అనుసరించియే హైకోర్టు పై విషయములలో వర్తింపవలెను.

236 జిల్లాజడ్జి అను పదములో సిటీ సివిల్ కోర్టుజడ్జి, అడిషనల్ జిల్లాజడ్జి, జాయింటు జిల్లాజడ్జి అసిస్టంటు జిల్లాజడ్జి

స్మాల్ కాజుకోర్టు చీఫ్‌జడ్జి, చీఫ్ ప్రెసిడెన్సి మేజస్ట్రేటు అడిషనల్ ప్రెసిడెన్సీ మేజస్ట్రేటు, సెషన్సుజడ్జి, అడిషనల్ సెషన్సుజడ్జి, అసిస్టెంటు సెషన్సుజడ్జి చేరి యుందురు.

237 పై నిబంధనలుకొన్ని తరగతులు మేజస్ట్రేటులకుగూడ వర్తింపవచ్చునని గవర్నరు ప్రకటించుట కధికారము గలదు.

## ఏ డ వ భా గ ము

మొదటి షెడ్యూలులోని బి భాగమందలి రాష్ట్రములు

238 ఆరవభాగమందలి నిబంధనలన్నియు మొదటి షెడ్యూలులోని ఎ భాగమునందలి రాష్ట్రములకు వర్తించినట్లే బి భాగమునందలి రాష్ట్రములకును వర్తించును.

గవర్నరు అను పదమునకు బదులు రాజ ప్రముఖుడు అను పదము చేర్చుకొనుచుండవలెను. మైసూరురాష్ట్రమున మాత్రము రెండు శాసన సభలును మిగిలిన రాష్ట్రములలో నొక్కొకటియు నుండును.

## ఎ ని మి ద వ భా గ ము

మొదటి షెడ్యూలునందలి సి భాగములోని రాష్ట్రములు.

239 మొదటి షెడ్యూలులోని సి భాగమందలి రాష్ట్రములు చీఫ్ కమిషనర్ ద్వారాగాని లెఫ్టనెంటు గవర్నరు ద్వారా గాని అధ్యక్షుడు పాలింపవలెను.

240 మొదటి షెడ్యూలునందలి సి భాగములోని రాష్ట్రములకు శాసనసభలను, ఎడ్వైజరు సంఘములను, మంత్రి వర్గములను ఏర్పరుపవచ్చును.

241 మొదటి షెడ్యూలులోని సి భాగమందలి రాష్ట్రములకు హైకోర్టును పార్లమెంటు ఏర్పరుపవచ్చును.

242 పార్లమెంటు వేరు విధముగా నిర్ణయించువరకు కూర్గు పరిపాలన ఈరాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి రాక పూర్వ మున్నట్లుగనే యుండును.

## తొమ్మిదవ భాగము.

## మొదటి షెడ్యూలులోని డి భాగమందలి రాష్ట్రములును ఇతర రాష్ట్రములును.

243 మొదటి షెడ్యూలులోని డి భాగమందలి రాష్ట్రములను ఛీఫ్ కమిషను ద్వారా అధ్యక్షుడు పరిపాలింపవలెను.

## ప ది య వ భా గ ము

## షెడ్యూల్డు కొండప్రాంతములు

244 మొదటి షెడ్యూలులోని ఎ, బి భాగములలో నుదహరింపబడిన షెడ్యూల్డు కొండప్రాంతముల పరిపాల

నకు ఐదవ షెడ్యూలులోని నిబంధనలు వర్తించును. అస్సాం రాష్ట్రములోని కొండప్రాంతములకు ఆరవ షెడ్యూలు నిబంధనలు వర్తించును.

## పదునొకండవ భాగము.

### యూనియనునకును రాష్ట్రములకును సంబంధములు.

245 భారతదేశమంతటికిని గాని అందు భాగమునకు గాని పార్లమెంటు శాసనములు చేయవచ్చును. రాష్ట్రశాసనసభలు రాష్ట్రమంతటికినిగాని, అందు భాగమునకుగాని శాసనములు చేయవచ్చును.

246 ఏడవ షెడ్యూలులోని మొదటి జాబితా అంశములను గూర్చి శాసనములు చేయుటకు పార్లమెంటుకే అధికారముగలదు. మూడవ లిస్టులోని అంశములకు పార్లమెంటును, రాష్ట్రశాసనసభలును శాసనములు చేయవలెను. రెండవలిస్టులోని అంశములకు రాష్ట్రసభలే శాసనములు చేయవలెను. ఏ యంశమునుగూర్చియైనను శాసనము చేయుటకు పార్లమెంటుకు అధికారముగలదు.

247 న్యాయపరిపాలన బాగుగ సాగుటకై పార్లమెంటు క్రొత్తన్యాయస్థానములను స్థాపింపవచ్చును.

248 ఏజాబితాలోను ఉదహరింపబడని అంశమునుగూర్చి శాసనము చేయుటకును, ఎట్టి పన్నునైనను విధించుటకును పార్లమెంటున కధికారము గలదు.

249 సేట్సుకౌన్సిలులో మూడింట రెండువంతులు సభ్యు లంగీకరించిన మీదట రాష్ట్రములకు సంబంధించిన అంశములను గూర్చికూడ పార్లమెంటు శాసనములు చేయవచ్చును.

250 అసాధారణ పరిస్థితులలో భారతదేశమం దేభాగమున కైనను వర్తించు అంశములు-రాష్ట్రీయాంశములు - గూర్చియైనను పార్లమెంటు శాసనముచేయుట కధికార ముగలదు.

251 పార్లమెంటు శాసనమునకును, రాష్ట్రశాసనమునకును ఏసందర్భములోనైనను విభేదమేర్పడినపుడు పార్లమెంటు శాసనమే చెల్లును.

252 రెండుగాని అంతకంటె ఎక్కువగాని రాష్ట్రశాసనసభ లంగీకారమున్న మీదట పార్లమెంటు ఆరాష్ట్రములకు వర్తించు శాసనము చేయవచ్చును.

253 అంతర్జాతీయపు ఒడంబడికలములు జరపుటకై భారత

దేశమందే ప్రాంతమునకైనను వర్తించు శాసనములు పార్లమెంటు చేయవచ్చును.

254 రాష్ట్రశాసనసభ చేసిన ఏ శాసనమైనను రద్దుచేయుటకును, సవరణచేయుటకును ఏవిధమైన మార్పైనను చేయుటకును పార్లమెంటున కధికారము గలదు.

255 క్రమ విధానమందు లోపమున్నంతమాత్రమున యూనియను, రాష్ట్ర శాసనములేవియు చెల్లకపోవు.

256 రాష్ట్ర ప్రభుత్వముల కార్యనిర్వహణము పార్లమెంటు శాసనముల ననుసరించియే యుండవలెను.

257 కార్యనిర్వహణ విషయమున భారత ప్రభుత్వము రాష్ట్ర ప్రభుత్వములకు అవసరమగు ఆదేశముల నీయవచ్చును.

258 కొన్ని సంవత్సరములలో కార్యములు నిర్వహింపవలెనని అధ్యక్షుడు భారతప్రభుత్వముతో సంప్రదించి రాష్ట్రములకు ప్రత్యేకాధికారము లీయవచ్చును.

259 ఈరాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి వచ్చుపరికి సైనికబలము గల్గియున్న రాష్ట్రములు అధ్యక్షుని ఉత్తరువునకు లోబడి ఇకముందును ఆ సైనికబలము గల్గి

యుండునుగాని ఆ సైన్యములు యూనియనునకె చెందును.

260 కేంద్రరాష్ట్ర ప్రభుత్వముల ఉత్తరువు లన్నియు భారత దేశమున నిరాటంకముగా చెల్లవలెను.

261 వివిధరాష్ట్రములమధ్య నీటిపారుదల తగాదాల పరిష్కారమునకు పార్లమెంటు శాసనము ద్వారా మధ్యవర్తుల నియమింపవచ్చును.

262 రాష్ట్రములమధ్య తగాదాల పరిష్కారమునకు వివిధ రాష్ట్రప్రతినిధి సంఘము నధ్యక్షుడు నియమింపవచ్చును.

## పండ్రెండవ భాగము

### ఆర్థిక, ఆస్తి, కంట్రాక్టు, దావా విషయములు

263 ఫైనాన్సుకమిషన్, స్టేట్ అను పదముల కీభాగమున విశేషార్థము గల్గియుండును.

265 న్యాయ సమ్మతముగాని ఎట్టిపన్నును విధింపరాదు, వసూలు చేయరాదు.

266 కేంద్ర ప్రభుత్వాదాయమును, రాష్ట్రప్రభుత్వాదాయమును కన్సాలిడేటెడ్ ఫండు, పబ్లికు ఎకౌంటు అను రెండు తరగతులుగ విభజింపబడును.

267 అవసర పరిస్థితులలో ఖర్చుపెట్టుటకు అధ్యక్షుని అధీనములో కంటింజెన్సీఫండు నుంచుటకు పార్లమెంటు శాసనము చేయవచ్చును. ఇట్లే రాష్ట్రములలోను అవసరపు ఖర్చులకు గవర్నరు అధీనములో కంటింజెన్సీ ఫండు ఉండవచ్చును.

268 యూనియను జాబితాలో నుదహరింపబడిన కొన్ని పన్నులు రాష్ట్ర ప్రభుత్వములు వసూలు చేయునుగాని అవి యూనియను ప్రభుత్వమునకే చెందును.

269 కొన్నిపన్నులు యూనియను ప్రభుత్వము వసూలుచేసి రాష్ట్రముల కీయవలెను:—వారసత్వపు పన్ను, ఎస్టేటు డ్యూటీ, ప్రయాణీకులపై పన్నులు, రైల్వేపన్నులు అడ్వర్టయిజుమెంటు పన్నులు మొదలైనవి.

270 కొన్నిపన్నులు యూనియను ప్రభుత్వము వసూలు చేయునుగాని, ఆమొత్తము యూనియను రాష్ట్రప్రభుత్వములు పంచుకొనవలెను.

271 అవసరమునుబట్టి యూనియను ఖర్చులకొరకు పార్లమెంటు ఏపన్నునైనను ఎక్కువ చేయవచ్చును.

172 కొన్ని ఎక్సైజ్ పన్నులు యూనియను ప్రభుత్వము

వసూలుచేసి శాసనరీత్యా నియమము లేర్పరచి రాష్ట్రములకు పంచవచ్చును.

273 జనుము ఎగుమతిపన్ను సందర్భములో ఏటేటను అస్సాం, బీహారు, ఒరిస్సా, పశ్చిమబంగాళ రాష్ట్రములకు కేంద్రప్రభుత్వము కొంత మొత్తము గ్రాంటుగా నిచ్చును.

274 రాష్ట్రములందు పన్ను లెక్కువచేయ నుద్దేశించు బిల్లులన్నిటిని అధ్యక్షుడు ముందుగనే సిఫారసు చేయవలసియుండును.

275 పార్లమెంటు శాసనము ననుసరించి కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వముల కేటేటను గ్రాంటులీయవచ్చును.

276 రాష్ట్ర ప్రభుత్వమును, స్థానిక సంస్థలును వృత్తిపన్ను వసూలు చేయవచ్చునుగాని ఏవ్యక్తి విషయముననూ ఆమొత్తము సంవత్సరమునకు రెండువందల ఏబది రూపాయలకు మించియుండరాదు.

277 ఈ రాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి రాకపూర్వము రాష్ట్రములు వసూలుచేయు పన్నులన్నియు, పార్ల

మెంటు అన్యథా నిర్ణయించు వరకు ఆరాష్ట్రములు వసూలుచేయుట కధికారము గలదు.

278 మొదటి షెడ్యూలులోని బి భాగమందలి రాష్ట్రములతో యూనియను కొన్నిపన్నుల వసూలు విషయమై ఒడంబడిక చేసికొనవచ్చును.

279 'నికరాదాయము' అనునది భారతప్రభుత్వపు కంట్రోలరు ఆడిటరు జనరలు నిర్ణయించిన రీతిగ నుండవలెను.

280 అయిదేండ్ల కొకసారి అధ్యక్షుడు ఫైనాన్సు కమీషనును (ఆర్థికసంఘము)ను నియమింపవలెను. ఇందు అయిదుగురు సభ్యులుందురు. వారిలో నొకడు చెయిర్మను. యూనియనునకును, రాష్ట్రములకును పన్నుల పంపకము అధ్యక్షుడు నియమించు ఇతర కార్యములను ఈ కమిషను నిర్వర్తింపవలెను.

281 ఫైనాన్సు కమిషను సూచనలన్నియు పార్లమెంటు ఎదుట అధ్యక్షు డుంపించవలెను.

282 ప్రజోపయోగకరములగు కార్యములన్నిటికిని కేంద్ర రాష్ట్రప్రభుత్వములు గ్రాంటులీయవచ్చును.

283 కన్సాలిడేటెడ్ ఫండు, కంటింజెన్సీఫండు మున్నగువాని

విషయమై నియమములు కేంద్రప్రభుత్వమున పార్ల మెంటును అధ్యక్షుడును, రాష్ట్రములలో శాసనసభలును గవర్నరును చేయవలెను.

284 ప్రభుత్వము తరపున ధనము వసూలుచేసిన ఉద్యోగులా మొత్తములను పబ్లికు ఎక్కౌంటులో జమకట్టవలెను.

285 ఇతర రాష్ట్రవర్తకులకును, విదేశవర్తకులకును సరకులమ్మినపుడు ప్రభుత్వము అమ్మకపుపన్ను వసూలు చేయరాదు.

287 ప్రభుత్వ ముపయోగించు విద్యుచ్ఛక్తి విషయమున పన్ను విధింపబడరాదు.

288 వివిధ రాష్ట్రముల ఉపయోగమునకై వినియోగింపబడు నీటిపారుదలపై పన్ను విధింపబడరాదు.

289 రాష్ట్రాదాయముపై యూనియను ప్రభుత్వము పన్ను విధింపరాదు.

290 రాష్ట్రప్రభుత్వములకును యూనియను ప్రభుత్వమునకును మధ్య పింఛనులు చెల్లించుటలో గల వ్యత్యాస

ములు విషయమై తగాదాలను భారత ప్రధానన్యాయ మూర్తి పరిష్కరించును.

291 స్వదేశ సంస్థానాధీశుల భరణములు ఇండియా కన్సాలిడేటెడ్ ఫండునుండి చెల్లింపబడవలెను; ఈభరణముల కాదాయపు పన్ను ఉండరాదు.

292 కన్సాలిడేటెడ్ ఫండు ధరావతుమీద యూనియను ప్రభుత్వము రుణము చేయవచ్చును.

293 అట్లే రాష్ట్రప్రభుత్వములును ఋణము చేయవచ్చును. కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వములకు ఋణమీయ వచ్చును; అధ్యక్షుని అనుమతి మీదనే రాష్ట్రప్రభుత్వ ములు ఋణము చేయవలెను.

294 ఈరాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి వచ్చుటకు పూర్వ ము బ్రిటిషు ప్రభుత్వమునకును, డొమినియను ప్రభు త్వమునకును చెందియుండిన ఆస్తి హక్కులన్నియు ఇక మీదట యూనియను ప్రభుత్వమునకును రాష్ట్రప్రభు త్వమునకును చెందవలెను

295 ఈ రాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి రాకపూర్వము మొదటి షెడ్యూలు బి భాగమున నుదహరింపబడిన

రాష్ట్రముల ఆస్తిహక్కులును యూనియను రాష్ట్ర ప్రభుత్వముల కికమీదట చెందవలెను.

296 ఈ రాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి రాకుండనుండి నచో బ్రిటిషు ప్రభుత్వమునకును సంస్థానాధీశులకును ఏ కారణముచే నైనను దాఖలు పడియుండవలసిన ఆస్తి యంతయు ఇకమీదట రాష్ట్రములకును యూనియను నకును చెందవలెను.

297 భారత దేశపు సరిహద్దులలో సముద్రగర్భమున నిమిడి యుండు భూములును, ఖనిజములును యూనియను ఆధీనమైయుండును.

298 యూనియను రాష్ట్రభుత్వములకు ఆస్తి సంపాదించుట కధికారముండును.

299 యూనియను ప్రభుత్వముతరఫున జరగు కంట్రాక్టు లన్నియు అధ్యక్షుని పేరను, రాష్ట్ర ప్రభుత్వపు కంట్రాక్టులు గవర్నరు పేరను జరుగును. కాని వారి వ్యక్తి పరముగా గాక ఉద్యోగధర్మమునుబట్టి వారికి వాని బాధ్యత వర్తించును.

300 యూనియను రాష్ట్ర ప్రభుత్వము ఇతరులపై దావా లుచేయవచ్చును. ఆ ప్రభుత్వములపై నితరులు దావా చేయవచ్చును.

## పదమూడవ భాగము

### వర్తకవ్యాపారములు, ప్రాంతీయసంబంధము.

**301** వర్తక వ్యాపారములలోను ప్రాంతీయసంబంధముల లోను స్వేచ్ఛయుండవలెను.

**302_307** పార్లమెంటుగాని రాష్ట్రీయ శాసన సభలుగాని వర్తకవ్యాపారములలో రాష్ట్రములమధ్య పక్షపాతము చూపు శాసనములు చేయరాదు. కాని ప్రజాశ్రేయస్సునకోరి వ్యాపార నిర్బంధములను శాసనముద్వారా పార్లమెంటు అమలు జరుపవచ్చును. భారత ప్రభుత్వముతో ఒడంబడిక చేసికొన్నమీదట మొదటి షెడ్యూలులో బి భాగమునందలి రాష్ట్రములు కొన్ని వ్యాపార నిర్బంధములు విధింపవచ్చును.

## పదునాల్గవ భాగము

### యూనియను రాష్ట్రప్రభుత్వముల ఉద్యోగిబృందము

### మొదటి అధ్యాయము – ఉద్యోగులు

**308_314** యూనియను, రాష్ట్రీయ ఉద్యోగుల నియామకము, నిబంధనలు మున్నగువానిని పార్లమెంటు, రాష్ట్రీయ శాసనసభలు శాసనములద్వారా నిర్ణయింపవలెను.

లేక అధ్యక్షుడుగాని గవర్నరుగాని రాజప్రముఖుడు ఆనిబంధన లేర్పరుపవచ్చును. ఉద్యోగులకు అక్రమము జరగినచో అప్పీలు చేసికొనవచ్చును. అక్రమప్రవర్తన ఋజువైనచో ఉద్యోగులు బర్తరఫ్ (డిస్మిస్) చేయబడ వచ్చును. యూనియనను కును రాష్ట్రములకును ఉమ్మడిగా ఆల్ ఇండియా సర్వీసులు కొన్ని యుండవచ్చును.

రెండవ అధ్యాయము - పబ్లిక్ సర్వీస్ కమిషన్

15_323 యూనియనునందును, రాష్ట్రములందును ఉద్యోగులను నియమించు నిమిత్తము పరీక్షలు జరపుటకు యూనియనునకున్ను, రాష్ట్రములకును పబ్లికుసర్వీసు కమిషను లుండును. యూనియను పబ్లికు సర్వీసు కమిషను సభ్యులను అధ్యక్షుడును, రాష్ట్రపబ్లికు సర్వీసుకమిషను సభ్యులను గవర్నరుగాని రాజప్రముఖుడుగాని నియమించును; కమిషను సభ్యుల ఉద్యోగకాలము ఆరేండ్లు. ఉద్యోగుల నియమింపవలసిన సూత్రములగూర్చి సలహా నిచ్చుటకై పబ్లికు సర్వీసుకమిషను ముఖ్యవిధి ఒక్కొక కమిషనును ఏటేటను జరగిన తమ కార్యక్రమమును గూర్చి ఒక నివేదిక పంపవలెను.

## పదునైదవ భాగము – ఎన్నికలు

324_329 పార్లమెంటు, రాష్ట్రీయ శాసనసభల సభ్యుల ఎన్నికలును అధ్యక్ష ఉపాధ్యక్షుల ఎన్నికలును జరపుటకును ఈ ఎన్నికలలో వివాదములు, సంశయములు ఇట్టివి అన్నియు పరిష్కరించుటకును ఒక ఎలెక్షన్ కమిషన్ ఉండవలెను. ఈ ఎలెక్షను కమిషను సభ్యులను అధ్యక్షుడు నియమింపవలెను. ఈ కమిషనులో చీఫ్ఎలెక్షను కమిషనరును, మరికొందరు సభ్యులు నుండవలెను. హౌస్ ఆఫ్ ది పీపిల్‌కును (ప్రజాసభకును) లెజిస్లేటివ్ ఎసెంబ్లీకును వయోజన ఎన్నిక విధానము ననుసరించి అనగా ఇరువదియొక్క సంవత్సరములు వయసు నిండిన వారందరును (స్థిరనివాసములేనివారు, మతిస్థిమితము లేనివారు, నేరస్థులు తప్ప) వోటుచేయుట కర్హత గల్గియుందురు. ఎన్నికల విషయమున అవసరమగు శాసనములు పార్లమెంటును రాష్ట్రీయ శాసనసభలును చేయవచ్చును.

## పదునారవ భాగము

## కొన్ని తరగతుల ప్రజలకు ప్రత్యేక నిబంధనలు

330_342 ప్రజాసభలో క్రిందితరగతుల ప్రజలకు కొన్నిస్థానములు ప్రత్యేకింపబడవలెను :– (i) షెడ్యూలువర్గ

ములు (ii) షెడ్యూల్డు జాతులు (iii) అస్సామందు స్వతంత్రజిల్లాలలో షెడ్యూలుజాతులు. (షెడ్యూల్డు వర్ణములనగా హరిజనులు మొదలైనవారు, షెడ్యూల్డుజాతులనగా కొండజాతులు).

ఆంగ్లోఇండియనులకు గూడ కొన్నిస్థానములు ప్రత్యేకింపబడవలెను. ఈ రాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి వచ్చిన పిదప పదేండ్లకు ఇట్లు ప్రత్యేకించు ఏర్పాటు రద్దగును. ఏది షెడ్యూల్డు వర్ణములో, ఏది షెడ్యూల్డు జాతులో గవర్నరు రాజప్రముఖుల సలహాతో అధ్యక్షుడు నిర్ణయించి ప్రకటించును. ఇట్టి జాతుల యోగక్షేమము పరిశీలించుట కొక ప్రత్యేకోద్యోగి నియమింపబడును.

## పదునేడవ భాగము

## రాజకీయ భాష

343-351 యూనియను ప్రభుత్వపు రాజకీయభాష దేవనాగర లిపిలో వ్రాయబడు హిందీభాషగా నుండవలెను. అంతర్జాతీయ స్వరూపము పొందిన భారతీయ సంఖ్యామానమే రాజకీయ కార్యముల కుపయోగింపవలెను. కాని 1950 సం॥ జనవరి 26 వ తేదీ

నుండి పదునై దేండ్ల వరకు హిందీకి బదులుగా ఇంగ్లీషుభాష రాజకీయభాషగా నుపయోగింపబడ వచ్చును. పదునై దేండ్ల పిదప ఈవిషయమున పున రాలోచన జరుపబడును. ఈలోపుగా రాజకీయ భాష విషయమున పరిస్థితులు పరిశీలించుట కధ్య క్షుడప్పుడప్పుడు కమిషను నియమింపవలెను.

రాష్ట్రమందలి భాషలలో నొకటిగాని అంతకంటె నెక్కువగాని, హిందీగాని రాష్ట్రములలో రాజకీయ భాషగా నుండవలెను. రాష్ట్రీయ శాసనసభ ఇతరవిధమున నిర్ణయించు వరకు ఇంగ్లీషుభాష రాజకీయ భాషగా నుండవలెను. యూని యను రాజకీయభాషయే యూనియను-రాష్ట్రముల మధ్యను, వివిధ రాష్ట్రముల మధ్యను, ఉత్తర ప్రత్యుత్తరముల కుపయో గింపవలెను.

సుప్రీంకోర్టులలోను, హైకోర్టులకును, బిల్లులకును, ఆక్టు లకును ఇంగ్లీషుభాషనే ఉపయోగింపవలెను.

హిందీభాష ప్రచారములోనికి తెచ్చు విషయమై యూనియను ప్రభుత్వము రాష్ట్రప్రభుత్వముల నాదేశింప వలెను.

## పదునెనిమిదవ భాగము

### అసాధారణ నిబంధనలు

352_360 భారతదేశమునకు విదేశ శత్రువుల వలనగాని, దేశమధ్యమున అల్లకల్లోల పరిస్థితులవలన ప్రమాదకరమగుపరిస్థితి యేర్పడి దేశశాంతికి భంగకరమనియు, ఉపద్రవకరమనియు, అధ్యక్షుడు విశ్వసించిన సందర్భములో యీనియమనకు సంబంధించిన శాసననిర్మాణకార్యనిర్వాహణాధికారము లన్నియు అధ్యక్షుడు అమలు జరుపవచ్చును.

## పందొమ్మిదవ భాగము

### వివిధ విషయములు

361_367 అధ్యక్షుడు, గవర్నరు, రాజప్రముఖుడు వీరికిగల రక్షణ, స్వదేశ సంస్థానాధీశుల ప్రత్యేక సౌకర్యములును హక్కులును రేవుపట్టణములకును విమానాశ్రయములకును సంబంధించిన నియమములు నిర్వచనములు – ఇట్టివి ఈ నిబంధనలలో వివరింపబడినవి.

## ఇరువదియవ భాగము

## రాజ్యాంగ ప్రణాళికకు సవరణ

368– ఈ రాజ్యాంగ ప్రణాళికకు ఏదైనను సవరణ చేయవలసిన సందర్భములో అందులకు పార్లమెంటు శాసనసభలలో నొకసభయందు సవరణ సూచించు బిల్లు ప్రతిపాదింపవలెను. ఆబిల్లు అధికసంఖ్యాక సభ్యులచేత (హాజరైనవారిలో మూడింట రెండు వంతులు సభ్యులచెంతను) ఆమోదింపబడవలెను. పిదప అధ్యక్షుడా బిల్లునకనుమతి యీయవలెను. ఆ సవరణ రాష్ట్రములకు సంబంధించిన దైనచో మొదటి షెడ్యూలునందలి ఎ. బి. భాగములందలి రాష్ట్రములలో సగము రాష్ట్రముల శాసనసభలలో అధ్యక్షుని అనుమతికి ముందుగనే తీర్మానింపబడవలెను.

## ఇరువదియొకటవ భాగము.

## తాత్కాలిక నియమములు

369–392 రాష్ట్రీయ పరిపాలనాంశముల జాబితా, జుమ్ము, కాశ్మీరు సంస్థాన పరిపాలన, శాసనములు, న్యాయ శాస్త్రము, న్యాయస్థానముల కార్యక్రమము, పార్లమెంటు, సభాపతి, ఉపసభాపతి, అధ్యక్షుడు,

గవర్నరు, మంత్రివర్గము, ఆర్థిక వియషయములు ఇట్టి వివిధవిషయములలో క్రొత్తరాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి వచ్చుసరికి ఉన్నపరిస్థితులకు భంగములేకుండ క్రొత్త ఏర్పాట్లు జరగువరకును సక్రమముగా కార్యక్రమము నడపించుటకు అవకాశము కల్పింపబడినది. సందేహాగ్రహస్థమగు విషయములలో అధ్యక్షుని పరిష్కారములు జరుగవలెను.

### ఇరువది రెండవ భాగము

### శీర్షిక, ఆరంభము, రద్దు

393-394 ఈ రాజ్యాంగ ప్రణాళికకు భారతరాజ్యాంగ ప్రణాళికయను శీర్షికతో నమలుజరగును. ఇందు దిగువ పేర్కొనబడిన నిబంధనలు వెంటనే (26-11-1949) అమలులోనికి వచ్చును. మిగిలిన నిబంధనలు 1950 జనవరి 26 తేది నుండి అమలులోనికి వచ్చును.

ఈ రాజ్యాంగ ప్రణాళిక మూలమున 1935 సంవత్సరపు ఇండియా గవర్నమెంటు ఆక్టును, 1949 భారతస్వాతంత్ర్య శాసనమును 1949 సం॥ ప్రివీకౌన్సిలు ఆక్టును రద్దగును.

## మొదటి షెడ్యూలు

### భారతదేశపు రాష్ట్రములును - ప్రాంతములును

#### ఎ భాగము - రాష్ట్రముల పేర్లు

1 అస్సాం.
2 బీహారు.
3 బొంబాయి.
4 మధ్యప్రదేశము (మధ్యరాష్ట్రములు.)
5 మదరాసు.
6 ఒరిస్సా.
7 పంజాబు.
8 ఉత్తర ప్రదేశము (సంయుక్త పరగణాలు)
9 పశ్చిమ బంగాళము.

#### బి భాగము - రాష్ట్రముల పేర్లు

1 హైదరాబాదు.
2 జమ్ము కాశ్మీరము.
3 మధ్యభారతము.
4 మైసూరు.
5 పాటియాలా తూర్పు పంజాబుయూనియను.
6 రాజస్థానము.
7 సౌరాష్ట్రము.
8 తిరువాన్కూరు, కొచ్చిన్.
9 వింధ్యప్రదేశము.

#### సి భాగము - రాష్ట్రముల పేర్లు

1 అజ్మీర్.
2 భూపాల్.
3 బిలాస్‌పూర్.
4 కూచ్‌బిహార్.
5 కూర్గు.
6 ఢిల్లీ.
7 హిమాచల ప్రదేశము.
8 కచ్చి.
9 మణిపురము.
10 త్రిపుర.

డి భాగము

అండమాను నికోబారు దీవులు.

## రెండవ షెడ్యూలు

### ఎ భాగము

అధ్యక్షుని (ప్రెసిడెంటు) జీతము—10000 రూపాయలు (నెలకు)

గవర్నరు జీతము—5500 రూపాయలు (నెలకు)

### బి భాగము

యూనియన్ ప్రధానమంత్రి, ఇంతవరకు యూనియను మంత్రులు, రాష్ట్రమంత్రులు—వీరి జీతములు ఈ రాజ్యాంగ ప్రణాళిక అమలులోనికి వచ్చునాటి కున్నరీతిగనే ఉండవలెను.

### సి భాగము

యూనియను స్పీకరు డెప్యూటి స్పీకర్లు చెయిర్మను, డెప్యూటి చెయిర్మను—వీరిజీతములు కాన్సిట్యుయెంటు, అసెంబ్లీ ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటులవలె నుండవలెను.

రాష్ట్రముల స్పీకరు, డెప్యూటీస్పీకరు చెయిర్మనుల డెప్యూటీ చెయిర్మనుల జీతములు ఈరాజ్యాంగ ప్రణాళిక

అమలులోనికి వచ్చుసరికి ఉన్న స్పీకరు, డెప్యూటిస్పీకరుల జీతములవలె నుండవలెను.

డి భాగము

సుప్రీంకోర్టు ప్రధానన్యాయమూర్తి జీతము-5000 రూపాయలు (నెలకు)

సుప్రీంకోర్టు సాధారణన్యాయమూర్తి 4000 రూపాయలు (నెలకు)

హైకోర్టు ప్రధానన్యాయమూర్తి జీతము-4000 రూపాయలు (నెలకు)

హైకోర్టు సాధారణ న్యాయమూర్తి జీతము-3500 రూపాయలు (నెలకు)

యి భాగము

కంప్ట్రోలరు ఆడిటరు జనరలు జీతము 4000 రూపాయలు (నెలకు)

మూడవ షెడ్యూలు

ఇందు యూనియను మంత్రులు, పార్లమెంటు సభ్యులు, సుప్రీంకోర్టు న్యాయమూర్తులు, కంప్ట్రోలరు ఆడిటరు జనరలు, రాష్ట్రీయమంత్రులు, రాష్ట్రీయ శాసనసభ్యులు, హైకోర్టు

న్యాయమూర్తులు వీరందరును చేయవలసిన ఉద్యోగ రహస్య ప్రమాణముల రీతులు వివరింపబడినవి.

## నాల్గవ షెడ్యూలు

### స్టేట్సు కౌన్సిలునందు వివిధరాష్ట్రముల కుండవలసిన సభ్యత్వ స్థానములు

| మొదటి షెడ్యూలు ఎ భాగపు రాష్ట్రములు | | |
|---|---|---|
| 1 అస్సాం | 6 | స్థానములు |
| 2 బీహారు | 21 | ,, |
| 3 బొంబాయి | 17 | ,, |
| 4 మధ్య ప్రదేశము | 12 | ,, |
| 5 మదరాసు | 27 | ,, |
| 6 ఒరిస్సా | 9 | ,, |
| 7 పంజాబు | 8 | ,, |
| 8 ఉత్తరప్రదేశము (సంయుక్త పరగణాలు) | 31 | ,, |
| 9 పశ్చిమబంగాళము | 14 | ,, |
| మొత్తము | 145 | |

| మొదటి షెడ్యూలు బి భాగపు రాష్ట్రములు | | |
|---|---|---|
| 1 హైదరాబాదు | 11 | స్థానములు |
| 2 జమ్ముకాశ్మీరు | 4 | ,, |
| 3 మధ్యభారతము | 6 | ,, |
| 4 మైసూరు | 6 | ,, |
| 5 పాటియాలా తూర్పు పంజాబు యూనియను) | 3 | ,, |
| 6 రాజస్థానము | 9 | ,, |
| 7 సౌరాష్ట్రము | 4 | ,, |
| 8 తిరువాన్కూరు | 6 | ,, |
| 9 వింధ్యప్రదేశము | 4 | ,, |
| | 53 | |

మొదటి షెడ్యూలు సి భాగపు రాష్ట్రములు

| | | | | |
|---|---|---|---|---|
| 1 అజ్మీర్ | 1 | 6 కూచ్ బీహారు | 1 |
| 2 కూర్గు | 1 | 7 ఢిల్లీ | 1 |
| 3 భూపాల్ | 1 | 8 కచ్ఛి | 1 |
| 4 బిలాస్పూర్ | 1 | 9 మణిపూర్ | 1 |
| 5 హిమాచలప్రదేశము | 1 | 10 త్రిపుర | 1 |
| | | మొత్తము | 7 |

అన్ని సభ్యత్వ స్థానముల మొత్తము 205

అయిదవ షెడ్యూలు

షెడ్యూల్డు ప్రాంతములను, షెడ్యూలు జాతులును పాలించుటకు నియమములు

ఆరవ షెడ్యూలు

అస్సాం సందలి కొండప్రాంతములు పరిపాలించుట నియమములు.

ఏడవ షెడ్యూలు

మొదటి జాబితా (లిస్టు) యూనియను పరిపాలనాంశముల జాబితా దేశరంక్షణ, సైనికదళము, నౌకాదళము, వైమానిక దళము, ఆయుధ సామగ్రి, కెంటొన్మెంట్లు, అణుశక్తి, అపరాధ రహస్య పరిశోధన, విదేశ వ్యవహారములు, రాయబారములు, సంయుక్త జాతి సమితి వ్యవహారములు, అంతర్జాతీయ సభల లో పాల్గొనుట, విదేశపు ఒడంబడికలు, యుద్ధము చేయుట,

పౌరసత్వము, విదేశయాత్ర, కనుమతి, విదేశీయుల ప్రవేశ మున కనుమతి, యాత్రాస్థలములు, పార్లమెంటు ఎన్నికలు రైల్వేలు, రోడ్లు, ఓడప్రయాణము, లైట్ హౌసులు, రేవు పట్టణములు, విమానమార్గములు, రవాణా సాకర్యములు, పోస్టు టెలిగ్రాఫు టెలిఫోను, వైర్లెసు, బ్రాడ్‌కాస్టింగు, ప్రభు త్వ ఋణములు, కోర్టు ఆఫ్ వార్డ్సు, నాణెములు, కరెన్సీ, రిజ ర్వుబాంకు, సేవింగ్సు బాంకు, ప్రభుత్వమేర్పరచిన లాటరీలు, విదేశ వ్యాపారము, ఎగుమతి దిగుమతులు, దిగుమతిసుంక ములు, రాష్ట్రములమధ్య వర్తకము, సహకారసంఘములు, బాంకింగు, ఇన్సురెన్సు, కాపీరైటు ట్రేడుమార్కు, తూనికలు, కొలతలు, పరిశ్రమలు, నదుల పారుదల, చేపలరేవులు, ఉప్పు పరిశ్రమ, నల్లమందు, సినిమెటోగ్రాపు, మ్యూజియములు, కాశీ విశ్వవిద్యాలయము, అలీఘరు విశ్వవిద్యాలయము ఢిల్లీ విశ్వవిద్యాలయము, జాతీయ వైజ్ఞానిక సంస్థలు, చారి త్రాత్మక వస్తువులు సర్వే, జనాభా, వ్యవసాయపుపన్ను కాక ఇతరమగు పన్నులు, ఇట్టివి 97 అంశములు.

రెండవజాబితా - రాష్ట్రీయ పరిపాలనాంశముల జాబితా

ప్రజాశాంతి, పోలీసు, న్యాయపరిపాలన, ఖైదులు, స్థానిక స్వపరిపాలన, ప్రజారోగ్యము, ఆసుపత్రులు, పుణ్యక్షే త్రములు, మత్తుపదార్థములు, విద్య, గ్రంథాలయములు, రోడ్లు, వంతెనలు, నావలు, ట్రాంవెలు, వ్యవసాయము, పశు

వైద్యము బందెలదొడ్లు, నీటిపారుదల కాలువలు, భూమిశిస్తు, అడవులు, చేపలరేవులు, రాష్ట్రమధ్య వర్తకము, సంతలు, వడ్డీవ్యాపారము, రైతులఋణములు, నాటకశాలలు, జూదము, రాష్ట్రపు ఎన్నికలు, రాష్ట్రీయఋణము నిధినిక్షేపములు, ఇండ్ల పన్నులు, భూమిపన్నులు, ఎలెక్ట్రిక్‌సిటీపన్ను, అడ్వర్టయిజ్‌మెంటుపన్ను, బండ్లపన్ను, వృత్తిపన్ను, స్టాంపుపన్ను, టోలు పన్ను,—ఇట్టివి 66 హాంశములు.

## మూడవజాబితా - ఉమ్మడి (కంకరెంటు) పరిపాలనాంశముల జాబితా

క్రిమినలు లా ప్రివెంటివ్ డిటెన్షన్ (శాంతిభద్రతలకు నిర్బంధించుట) వివాహము, విడాకులు, మైనర్లు, కంట్రాక్టు, పరువునష్టము, దివాలా, ధర్మకర్తృత్వము, సివిలుప్రొసీజరు, కోర్టుధిక్కారము, దేశద్రిమ్మరులు, మతిభ్రష్టత, భూతదయ, ఆహారపదార్థముల కలితి, ఔషధములు, శ్రేణుయూనియనులు, వృత్తివ్యాపారము, కార్మికుల శ్రేయస్సు, తరిఫీదు, జననమరణముల లెక్కలు, ధరలకంట్రోలు, ఫాక్టరీలు, ఎలెక్ట్రిసిటీ, వార్తాపత్రికలు, గ్రంథములు, అచ్చుయంత్రములు, శరణార్థుల ఆస్తులు, ఆస్థినష్టపరిహారము, స్టాంపుడ్యూటీ, సుప్రీంకోర్టు మినహాయించి మిగిలినకోర్టులపై అధికారములు.

ఇట్టివి 47 అంశములు.

## ఎనిమిదవ షెడ్యూలు.

### భాషలు.

1 అస్సామీసు.
2 బెంగాలీ.
3 గుజరాతీ.
4 హిందీ.
5 కన్నడము.
6 కాశ్మీరీ.
7 మలయాళము.
8 మరాఠీ.
9 ఓఢ్రము.
10 పంజాబీ.
11 సంస్కృతము.
12 తమిళము.
13 తెలుగు.
14 ఉర్దూ.

రాజన్ ఎలెక్ట్రిక్ ప్రెస్, రాజమండ్రి—1950.